


Join




**Carona**
STAMP
COLLECTORS'
CLUB

FREE

**Easy Membership! Unique benefits!**

Get details from your nearest
Carona Retail Shop or write to:

CARONA STAMP COLLECTORS' CLUB
17, 18, Saleh Ahmed Building,
Infantry Road, Bangalore 560 001.

**Take advantage of this opportunity now.**

Membership open to residents of Karnataka,
Kerala, Tamil Nadu and Andhra Pradesh States only

CHAITRA-CS-153-R

# ఫ్లాష్ వాడండి, చిరునవ్వులను చిందించండి.



మీరిప్పుడు తాజాదనంతో చిరునవ్వు
చిందించేందుకు కారణాలు :

**ఫ్లాష్ చిందించే తాజాదనం :**
ఫ్లాష్‌లోగల నీలపు పదార్థం నోటిలోని
దుర్గంధాన్ని, క్షయకారకమైన
పురుగులను దూరం చేస్తుంది.

**ఫ్లాష్ వల్ల ఆత్మవిశ్వాసం :**
ఫ్లాష్‌లో మీ దంతాలను,
చిగుళ్ళనూ మరియు మీ
నోటినంతనూ కాపాడేవన్నీ
ఉన్నాయని మీరు తెలుసు
కున్నందువల్ల వచ్చేదిది.

**ఫ్లాష్ యొక్క రుచి :**
అమ్మమ్మ...మురిపించచేసే
రుచి ..మరి కానేపు బ్రష్
చేసుకోవాలనిపించజేసే రుచి.




**ఫ్లాష్**
**టూత్ పేస్ట్**

తాజాదనం చిందించే నీలపుపదార్థం గలది.

everest/80/FL/183-tl

# శ్రద్ధాంజలి



## శ్రీ బి. ఎల్. ఎన్. ప్రసాద్

**జననం : 12-11-1934 :: నిర్యాణం 31-5-1980**

మా చందమామ వ్యవస్థాపకులూ, సంచాలకులూ అయిన శ్రీ బి. నాగిరెడ్డిగారి జ్యేష్ఠపుత్రుడు శ్రీ ప్రసాద్ మాకు ఇక లేరు. చనిపోయే నాటికి వారి వయసు 45 సంవత్సరాలు.

చందమామకు వారు ముద్రాపకులు మాత్రమే కాదు, దాని వ్యాప్తికీ, వృద్ధికీ దోహదం చేసిన మహా మేధావి. మాకు కలిగిన నష్టం తీరేది కాదు. వారిని ప్రేమతో స్మరిస్తూ, వారి జ్ఞాపకార్థం వారు నెలకొల్పిన ఉన్నత ప్రమాణాలను నిలబెట్టటానికి కృషిచేస్తాం. పబ్లిషర్స్



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''భ్రాతృహంతకుడు'']కు ఆధారం వేమూరి వెంకయ్య రచన. ఒక మనిషి చేసే ప్రయత్నం వల్ల కలిగే ఫలితం అచ్చగా ఆ మనిషి శక్తిసామర్థ్యాల మీదనే గాక పరిస్థితుల పైన కూడా ఆధారపడి ఉంటుంది. ఎంతటి బలశాలి అయినా ఇసుక నుంచి తైలం తియ్యలేడు.

## అమరవాణి

అసజ్జనేన సంపర్కాత్ అనయం యాంతి సాధవః,
మధురం శీతలం తోయం పావకం ప్రాప్య నిర్గుణమ్.

[మంచివారికి కూడా దుష్టసంపర్కం వల్ల అవినీతి కలుగుతుంది; చల్లని, తియ్యని నీరు అగ్ని సంపర్కంతో తన గుణాలను కోల్పోతుంది గద!]

సంపుటి 67 జూలై '80 సంచిక 1

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




టి. వాసు, హైదరాబాదు.

ప్ర: విశ్వంలోకి (కృత్రిమ) ఉపగ్రహాలనూ, రాకెట్‌లనూ పంపిస్తారుకదా. అవి ఒకటికి ఒకటి ఢీ కొనవా? మరియు వాటిలో మనుషులు ఉంటారా? వాటి పని అయిపోయిన తరవాత అవి ఎక్కడికి పోతాయి?

స: కృత్రిమ ఉపగ్రహాలు సాధారణ పరిస్థితులలో ఒకదానికి ఒకటి తగలటం జరగదు. దీనికి ముఖ్యకారణం; కృత్రిమ ఉపగ్రహం భూమి చుట్టూ తిరిగేది అయితే, దాని కక్ష్య పూర్తిగా దాని వేగం మీద ఆధారపడుతుంది. ఒకే వేగంతో రెండు ఉపగ్రహాల్ని ప్రయోగించినప్పటికీ, అది ఒకే కక్ష్యలో తిరుగుతున్నా, ప్రయోగ కాలంలో ఉన్న ఎడం కక్ష్యలో కూడా ఉంటుంది.

కృత్రిమ ఉపగ్రహం భూమి చుట్టూ తిరగకుండా ఇంకా దూరం పోతే, అది చంద్రుడి చుట్టూ తిరిగే అవకాశం ఉంటుంది. అలాటి కృత్రిమ ఉపగ్రహాలు చాలా కొద్దిగా ఉంటాయి. సాధారణంగా ఉపగ్రహాలు చంద్రుడి చుట్టూ శాశ్వతంగా తిరుగుతూ ఉండేటట్టు ప్రయోగించరు.

చంద్రుడి ఆకర్షణ పరిధిని కూడా దాటి వెళ్ళిన రాకెట్‌లు ఏకంగా సూర్యుడి చుట్టూ కక్ష్యను ఏర్పాటు చేసుకుంటాయి. కాలక్రమాన వాటి గతి ఏమయేదీ ఎవరూ చెప్పలేరు.

శాస్త్రజ్ఞులు రెండు కృత్రిమ ఉపగ్రహాలను సంధించే ప్రయోగాలు చేసిన సంగతి మనం పత్రికలలో చదువుతూ ఉంటాం. అలా చేయటానికిగాను భూమి చుట్టూ కక్ష్యలోకి వచ్చిన ఉపగ్రహాన్ని మళ్ళీ రాకెట్ ప్రయోగాలతో రెండవ ఉపగ్రహం కక్ష్యలోకి తీసుకురావాలి. ఈ పని చెయ్యటానికి ఉపగ్రహంలో మనుషులుంటారు. ఇలాగే చంద్రుడి మీద దిగి భూమికి తిరిగివచ్చిన అంతరిక్ష నౌకలలో కూడా అవసరమైనప్పుడు రాకెట్ ప్రయోగాలు చేసే మనుషులుంటారు.

"పని తీరిన" కృత్రిమ ఉపగ్రహాలు మనుషులతో కూడినవైతే విధిగా భూమికి తిరిగిరావాలి. లేనప్పుడు సాధారణంగా వాటిని అంతరిక్షంలో వదిలేస్తారు. అప్పుడవి, కొద్ది వందల మైళ్ళ ఎత్తులో ఉన్నవైతే గాలి నిరోధంవల్ల వేగమూ, ఎత్తూ కోల్పోయి, గాలి దిగువ పొరలలో గాలి ఒరిపిడికి తగలబడిపోతాయి. సామాన్య ప్రమాణం గలవి ఆకాశంలోనే, చిన్న చిన్న ఉల్కలలాగా, బూడిద అయిపోతాయి. మరీ పెద్దవైతే వాటి భాగాలు స్కైలాబ్ లాగా భూమి మీద పడవచ్చు.




## 85

### పరధర్మం భయావహం

పవిత్రమైన వారాణసి నగరంలో కర్పూర పటకుడు అనే చాకలి ఉండేవాడు. వాడు ఒకరాత్రి అలసిపోయి గాఢనిద్రలో పడిపోయాడు. వాడి ప్రాంగణంలో వాడి గాడిదా, కుక్కా కట్టివేసి ఉన్నాయి.

ఇంతలో చాకలి ఆవరణలోకి ఒక దొంగ ప్రవేశించాడు.

అది చూసి గాడిద కుక్కతో, "మిత్రమా, నువ్వు వెంటనే మొరిగి, మన యజమానిని నిద్రలేపు. అది నీ ధర్మం కదా?" అన్నది.

''నువు నా విషయాలలో జోక్యం కలిగించుకుని, నా ధర్మం గుర్తుచేయవలసిన పనిలేదు. ఒకప్పుడు నేను ఎంతో విశ్వాసంతో నా యజమాని ఇంటినీ, సొత్తునూ కాచిన సంగతి నీకు తెలుసు. చాలాకాలంగా సుఖమూ, క్షేమమూ మరిగి అతగాడు నా విలువ మరచిపోయి, నాకు చాలినంత తిండి పెట్టకుండా ఉన్నాడు. అంతో ఇంతో అపాయం ఎదురయేదాకా యజమానులు తమ సేవకులను లక్ష్యపెట్టరు. ఇవాళ దొంగను కొన్ని వస్తువులు దోచుకుపోనీ! రేపటి నుంచీ యజమాని నాకు బాగా తిండి పెట్టుతాడు,'' అన్నది కుక్క.

''నా మాట వినవే, త్రాష్టమా! తన ధర్మం నిర్వర్తించవలసిన క్షణంలో స్వార్థం ఆలోచించే మనిషి ఎలాటి నౌకరు, ఎలాటి మిత్రుడు?'' అన్నది గాడిద.

''సేవకులను తిండికి మాడ్చి, అవసరం పడినప్పుడు మాత్రమే తియ్యటి మాటలాడేవాడు ఏమన్న యజమాని?'' అని కుక్క అడిగింది.

ఈ మాటకు గాడిద మండిపోయి, ''పాపిష్ఠిదానా! ఇలాటి సమయంలో యజమాని క్షేమాన్ని విస్మరించే నువు ఎంతో హీన ప్రాణివి! చేసేదేముందీ? నేనే శక్తివంచనలేకుండా యజమానిని నిద్ర లేపుతాను. వెచ్చదనం కోసం సూర్యుడికి వీపు చూపాలి, అగ్నికి ముఖం చూపాలి; యజమానిని మనస్ఫూర్తిగా సేవించాలి; నిర్మల చిత్తంతో ఉత్తమ లోకాల కోసం కృషి చెయ్యాలి,'' అని, గట్టిగా ఓండ్ర పెట్టింది.

గాడిద అరుపు వింటూనే, దొంగ పారిపోయాడు. కాని మంచి నిద్ర పాడుచేసినందుకు చాకలివాడు లేచి, గాడిదను చావగొట్టాడు.

ఏనుగును చంపిన నక్క

బ్రహ్మారణ్యంలో కర్పూరతిలకం అనే ఏనుగు ఉండేది. దాన్ని చూసి నక్కల మంద, ''దీన్ని చంపగలిగితే మనకు నాలుగు నెలలపాటు తిండి కొరత ఉండదు,'' అనుకున్నవి.

ఒక ముసలినక్క మిగిలిన వాటితో, ''నేను నా బుద్ధిబలంతో దానికి చావు తెప్పిస్తాను,'' అని, ఏనుగు వద్దకు వెళ్ళి, సాష్టాంగ నమస్కారం చేసి, ''ప్రభూ, నా మనవి ఆలకించాలి,'' అన్నది.

''నువు ఎవరు?'' అన్నది ఏనుగు.

ముసలినక్క ఇలా చెప్పింది:

''నేను నక్కను. అరణ్యమృగాలు సభ చేసి నన్ను తమ దూతగా మీ వద్దకు



పంపాయి. అవి తమతో ఇలా చెప్ప మన్నాయి: 'మేము రాజు లేకుండా జీవించటం భావ్యంకాదు గనక, సకల రాజలక్షణాలూ గల తమరిని మా రాజుగా అభిషేకించ నిశ్చయించాము. గొప్ప వంశంలో పుట్టి, ఉదారమైన శీలమూ, సద్వర్తనా కలిగి, పవిత్రుడై, రాజనీతి తెలిసినవాడు రాజుకావటానికి అర్హుడు. ఎవరుగాని ముందు రాజును చూసుకుని, తరవాత భార్యనూ, సంపదనూ వెతుక్కో వాలి. రాజు లేనిపక్షంలో భార్యా, సంపదా ఉండి మాత్రం ఏం లాభం? వాటిని క్షణంలో దొంగలు కాజేస్తారు! రాజు వర్షం లాగా ప్రాణదాత. కాకపోతే, నీటి ఎద్దడిలో నైనా ప్రాణాలు నిలుపుకోవచ్చును గాని, రాజు లేకుండా సాధ్యం కాదు. సాధారణంగా ప్రజలు రాజభీతి చేతనే సరిగా ప్రవర్తించుతారు. సహజమైన పుణ్యాత్ములు చాలా అరుదు. తమ భర్తలు ముసలివారైనా, అవిటివారైనా, రోగిష్ఠివారైనా, నిర్ధనులైనా భార్యలు వారి పట్ల విశ్వాసంగా ఉంటారంటే, అది దండ భీతితోనే కదా! తమరు ఆదర్శ ప్రభువులు! అందుచేత తమరిని రాజుగా అభిషేకించటానికి వేచి ఉన్నాం. కనుక, స్వామీ, తమరు నా వెంట త్వరగా వచ్చి, సుముహూర్తం దాటిపోకుండా మాకు రాజు కండి!''

రాజరికం మీద దురాశకొద్దీ, కర్పూర తిలకం నక్క వెనకగా బయలుదేరింది.



దారిలో ఒక ఊబి ఉన్నది. అది పైకి ఊబిలాగా కనబడదు. నక్క దాని అంచు వెంబడి ఉన్న గట్టి నేల మీద నడుస్తూ ముందుకు పోయింది. కాని ఏనుగు ఊబిలో దిగబడిపోయి, "మిత్రమా, నక్కా! ఇప్పుడు నేనేం చేసేది? నేను ఈ ఊబిలో ఇరుక్కుపోయి, ఘోరమైన చావు చావబోతున్నాను. ఒక్కసారి వెనక్కు తిరిగి, నన్ను చూడు,'' అన్నది, దీనంగా.

నక్క వెనక్కు తిరిగి చూసి, వెటకారంగా నవ్వుతూ, ''నా తోక పట్టుకుని పైకి రా! నా వంటి ప్రాణిని బుద్ధితక్కువగా నమ్మినందుకు నీకీ విపత్తుతప్పదు. సజ్జనులతో స్నేహం చేసేవారు బాగుపడతారనీ, దుర్మార్గులతో చేరినవాళ్లు నశిస్తారనీ పెద్దలు చెప్పనే చెప్పారు,'' అన్నది.

ఏనుగు కొంతసేపటికి ఆ ఊబిలోనే చచ్చిపోయింది.

నక్కల మందకు దాని శరీరం చాలా కాలంపాటు ఆహారమయింది.

### పనితీరిన భృత్యుడు

ఆరావళీ పర్వతాలలో ఒక శిఖరం మీద మహావిక్రమం అనే సింహం ఉండేది. అది నిద్రపోయినప్పుడల్లా ఒక చుంచు వచ్చి సింహం మీదికి ఎక్కి, దాని జూలు కొరికేది. సింహానికి తగని చిరాకుపుట్టేది. కాని ఆ చుంచు చలాకీగా సింహానికి అందకుండా తప్పించుకునేది.

చుంచు బెడద ఎలా వదిలించుకోవాలో తెలీక, దానికి అసలైన శత్రువు పిల్లి కనక, ఒక పిల్లిని చేరదీసి, దానికి మాంసం మేపుతూ వచ్చింది సింహం.

పిల్లిని చూసినాక చుంచు తన కలుగులో నుంచి బయటికిరాక, తిండికి మాడ సాగింది, కాని అలా ఎంతకాలం మాడు తుంది? అది సాహసించి ఒకసారి బయటికి వచ్చేసరికి, పిల్లి స్వామిభక్తి కొద్దీ ఆ చుంచును పట్టి, చంపేసింది.

అంతే, అటుతరవాత సింహం, పిల్లితో పని తీరిపోయి, దానికి మాంసఖండాలు పెట్టటం మానేసింది.






## 3

[కుండలినీ సైన్యాలతో వున్న ఓడలు, తీవ్రమైన తుఫాను గాలిలో చిక్కుకుని, సముద్రం మీద చెల్లాచెదరై పోయినై. సేనాని సమరసేనుడు అందుబాటులో వున్న ఓడలను ఒకచోట చేర్చి, చిన్న పడవలో కొందరు సైనికులతో ఒకానొక భయంకర ద్వీపం చేరాడు. అక్కడ వింత జంతువుల పోరాటం చూసి హడలిపోయి, అందరూ చెట్లెక్కారు. తరవాత—]

సమరసేనుడూ, అతడి సైనికులూ చెట్ల కొమ్మలలో దాగి, ఆ వింత జంతువుల పోరాటం చూడసాగారు. సింహాల పాల బడిన ఏనుగు, వాటినుంచి తప్పించుకునేటందుకు నానాయాతనా పడుతున్నది.

సమరసేనుడి వెంట చెట్ల కొమ్మల్లో దాగిన సైనికుల్లో ఒకడు, "సేనానీ, మనం పెద్ద చిక్కుల్లో పడిపోయాం. భయంకరమైన యీ ద్వీపాన్నుంచి మనం దోచుకుపోగలిగిన ధనరాసులేమున్నవి!" అన్నాడు.

ఆ వెంటనే మరొక సైనికుడు, "ధనరాసులా? మనం ప్రాణాలతో యిక్కడినుంచి బయట పడగలిగితే, అదే పది వేలు." అన్నాడు.

సమరసేనుడు దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. లోకమంతటా ప్రజలు నాగరికులై, చక్కటి జీవితాలు గడుపుతున్న



యీనాడు కూడా, ఈ ద్వీపవాసులింకా, రాతియుగంనాటి దశలోనే వున్నారని స్పష్టమవుతున్నది. ఇక్కడ ఒక రాజు అనీ, పరిపాలన అనీ వున్న సూచనలు లేవు. అలాంటి, యీ ద్వీపంలో ధనం ఎలా లభిస్తుంది ?

సమరసేనుడు యిలాంటి ఆలోచనల్లో వుండగా, అరణ్యమంతా ప్రతిధ్వనింప జేస్తూ, ''హేయ్, కాలభుజంగా! కంకాళా! రండి, రండి, ఆ చతుర్నేత్రుణ్ణి వెతికి పట్టి, హతమార్చండి!'' అనే ప్రళయ భీకర కంఠస్వరం వినబడింది.

ఇది విని సమరసేనుడికి గుండె ఆగినంత పని అయింది. అతడి వెంట కొమ్మల్లో దాగివున్న సైనికులు నిలువెల్లా వణికిపోసాగారు. ఆ భయంకర కంఠ ధ్వనికి దిగువ కొలను సమీపంలోవున్న జంతువులూ, చెట్లపైనున్న నరవానరాలూ చెల్లాచెదరై పారిపోయినై.

చూస్తూండగానే ఆ కొలను గట్టుపైకి, ఒక భయంకరాకారుడు వచ్చాడు. అతడు ఒక చిన్నపాటి తాటిచెట్టంత పొడవున్నాడు. అతడిది ఒంటికంటి చూపు. అతడి రెండు కాళ్ళనూ చుట్టుతూ కోరలుచాపి, ముందుకు ఉరుకుతున్న కాలసర్పం, వెనకవైపున అతడి తలకు కొంచెం ఎగువగా కదులుతూవస్తున్న మనిషి పుర్రె!

ఈ భయంకర స్వరూపుడు కొలను గట్టున నిలబడి, చుట్టూ పరికించి తల పంకిస్తూ, "హ఼్! మంత్రాల దీవి, జిల్లేళ్ళ దిబ్బ, పల్లేరుకొండ, కొండకొసను బండ! ఆ బండ మీద నిలబడి చూస్తే, ఏం కనబడుతుంది, కంకాళా ?" అని హుంకరించాడు.

అందుకు జవాబుగా, ఆ మనిషిపుర్రె వికటాట్టహాసం చేస్తూ, "నట్టనడి సముద్రాన నాట్యమాడే నావ. నావ లోపల ధనరాసులు. నావకు బయట కాపలాకాసే నాగకన్య. నాగకన్యను హతమార్చటమే తరువాయి - నావనిండుగావున్న ధనరాసులన్నీ మనవే!" అని చెప్పింది.

"అవును! ఇంత సాధించగలిగితే, ధనమంతా మనదే! కాని, చూడూ, ఆ చతుర్నేత్రుడు....హ఼్!" అంటూ మళ్లీ హుంకరించాడు ఒంటికంటివాడు.

చెట్టు కొమ్మల్లోవుండి, ఈ సంభాషణ అంతా వింటున్న సమరసేనుడికి ఒకవంక భయమూ, మరొకవంక ఆశ్చర్యమూ ఒక్కసారిగా కలిగినై. ఇప్పుడు తానున్నది మాంత్రికుల దీవి అనీ, ఆ దీవిలో ఒకానొక కొండ కొసనగల బండపై నిలబడి చూస్తే, సముద్రంలో ధనరాసులతో నిండివున్న నావ కనబడుతుందనీ, అతడు గ్రహించాడు.




అయితే, ఆ చతుర్నేత్రుడెవరు? భయంకరాకారుడైన యీ ఒంటి కంటి మాంత్రికుడికి, అతడికీ మధ్య శత్రుత్వం ఎందుకు కలిగింది? ఆ శత్రుత్వానికి నావలోని ధనరాసులే కారణమా, మరేదైనానా ?

సమరసేనుడు యిలా ఆలోచిస్తున్నంతలో, మాంత్రికుడు కొలను గట్టుదిగి అడవిలోకి వెళ్ళిపోయాడు. అతని వెంట కాలసర్పమూ, వెనకగా మనిషి పుర్రే కూడా వెళ్ళినై.

ఇంతవరకూ చెట్టు మీద గజగజ వణికిపోతున్న సైనికులు, ఆ ఏకాక్షి వెళ్లిపోగానే కొంచెం తెప్పరిల్లారు. అందరూ సమర




సేనుడి కేసి చూశారు. ఇంకా అందరి ముఖాలలోనూ భయచిహ్నాలు కనిపిస్తూనే వున్నవి.

సైనికులలో ఒకడు తడబడుతూ, "ఈ ఏకాక్షి గొప్ప మంత్రవేత్తలా వున్నాడు. వాడిని వెంబడించే కాల సర్పమూ, మనిషి పుర్రే ఎంత ధైర్యశాలికైనా భయంకలిగించి తీరుతవి. ఇటువంటి ద్వీపాన్ని, ఎంత త్వరగా వదిలితే అంతమేలు!" అన్నాడు.

ఇందుకు తమ సేనాని సమరసేనుడు ఎలాంటి సమాధానం చెపుతాడో అని సైనికులందరూ చెవులు రిక్కించి నిశ్శబ్దంగా కూర్చున్నారు. సమరసేనుడు కొంచెం సేపు వూరుకుని, తృప్తిగా తలాడించి, "ఇంతటి భయంకర దీవిలోనూ, మనకు ధనం లభించే అవకాశాలు కనబడుతున్నవి. పోతే, కావలసిందల్లా, కష్టాలను సహించే శక్తీ, గుండె నిబ్బరమూ!" అన్నాడు.

సమరసేనుడు, సైనికుల జవాబు కోసం చూడకుండా, నిశ్శబ్దంగా చెట్టు పై నుంచి కిందికి దిగాడు. అతడి వెనకగా సైనికులు కూడా చెట్టు దిగారు. "ఇక జరగనున్న దేమిటి?" అన్న ప్రశ్న ప్రతి సైనికుణ్ణీ కలవర పెడుతున్నది. ఏ నిర్ణయమైనా చేయవలసిన వాడు సమరసేనుడే గనక, అందరూ అతడి కేసి చూడసాగారు.

సమరసేనుడు, సైనికులందరి ముఖాల కేసీ ఓమారు పరీక్షగా చూసి, "విన్నారుకదా?....పల్లేరు కొండ, కొండ కొసను బండ — అంటూ ఒంటి కంటి మాంత్రికుడు చెప్పిన మాటలు? ఆ కొండనూ, దాని కొసనువున్న బండనూ వెతికి తెలుసుకో కలిగితే, మనం వచ్చిన పని చాలావరకు నెరవేరినట్టే!" అన్నాడు.

ఆ మాటలకు సైనికులలో ఒకడు సందేహిస్తూ. "ఆ మాంత్రిక ఏకాక్షి చెప్పిన మాటలలో వాస్తవం వున్నదంటారా?" అని అడిగాడు.

సమరసేనుడు ఒక్క క్షణం ఆగి, ''మాంత్రికుడు అడిగిన ప్రశ్నలోనూ, బదులుగా ఆ మనిషి పుర్రె చెప్పిన జవాబులోనూ అబద్ధంవుండే అవకాశం లేదు. పోతే, ధనంతో నిండిన నావను, ఒకానొక నాగకన్య కాపలా కాస్తున్నదని, వాళ్ళ సంభాషణను బట్టి తెలుస్తున్నది. అంతేగాక, చతుర్నేత్రుడు అనే మరి ఒక మంత్రవేత్త, వాళ్లకు బద్ధ శత్రువైవున్నట్టు కూడా మనం నమ్మవచ్చు. ఐతే, యిన్ని ప్రతి బంధకాలను తప్పించుకొని, ధన రాసులతో నిండివున్న ఆ నావను, మనం వశపరచుకోవటం ఎలా అన్నదే యిప్పుడున్న ముఖ్యసమస్య,'' అన్నాడు.

సైనికులకు యిది చాలా గడ్డు సమస్యగా కనిపించింది. తమ సేనా నాయకుడికి యీ విషయంలో సలహా యివ్వటానికి, వాళ్ళల్లో ఏ ఒక్కడికీ గుండెధైర్యం చాలిందికాదు. తుఫాను ధాటికి బెదిరిపోయిన సైనికులకు, యిప్పుడు సమరసేనుడు చెప్పిన మాటలు మరింత బెదురు పుట్టించినై.

సమరసేనుడు ఓసారిచుట్టూ కలయ జూశాడు. తరవాత మౌనంగా నడవ సాగాడు. సైనికులు అతణ్ణి అనుసరించారు. వాళ్లు అలా చెట్లకిందుగా నడుస్తూ కొంత దూరం వెళ్ళేసరికి, చెవులు






చిల్లులు పడేలాంటి పెద్ద అరుపు వినబడింది.

సమరసేనుడు ఆశ్చర్యపోతూ ఆ ధ్వని వచ్చిన వైపుకు చూసేంతలో, కారు నలుపు రంగులో వున్న గుడ్లగూబ ఒకటి వాళ్ళ తలలపైగా ఎగురుతూ, మనిషి గొంతుతో, ''చతుర్నేత్రా! చతుర్నేత్రా! నరమానవులు—నరాధములు! బహు పరాక్!'' అని అదేపనిగా హెచ్చరించ సాగింది.

ఆ నల్లని గుడ్లగూబనూ, భీతికొలిపే లాంటి దాని కంఠస్వరాన్ని విని, సమరసేనుడూ, సైనికులూ నివ్వెరపోయారు. పక్షుల చేత మానవభాష మాట్లాడించగల మాంత్రికుడు, ఎంత శక్తిమంతుడై వుంటాడో అన్న అనుమానంతో పాటు వాళ్ళకు ఎక్కడలేని భయం కూడా కలిగింది.

అంతలో సమరసేనుడికీ, సైనికులకూ దిగ్భ్రమ కలిగించే మరొక వింత దృశ్యం కంటబడింది. అది ఒక నరవానరం! దానిలో మానవ, వానర లక్షణాలు సమపాళ్ళలో వున్నవి. అది ఒక చెట్టుపై నుంచి దభీమంటూ కిందికి దూకింది. ఇంత వరకూ గాలిలో ఎరుగుతూ, హెచ్చరికలు పలుకుతున్న నల్లగూబ, ఆ నరవానరం భుజం మీద వాలి, దాని చెవిలో ఏదో రహస్యంగా చెప్పింది.

ఆ వెంటనే నరవానరం సమరసేనుడికేసీ, సైనికులకేసీ ఓమారు చూసి, చెట్ల నుంచి వేళ్ళాడుతున్న తీగల ఆధారంతో, ఒక చెట్టుపైనుంచి మరొక చెట్టుపైకి దూకుతూ, క్షణంలో అదృశ్యమైపోయింది.

సైనికుల్లో ఒకడు నరవానరం కనబడకుండా పోయిన దిక్కుకేసి చూస్తూ, ''సేనానీ, యిక మనం వెనుదిరిగి పోవడమే మంచిది. ఈ భయంకరమైన మంత్రాలదీవిలో మనం సాధించగలిగింది ఏమీలేదు. పక్షులనూ, జంతువులనూ వేగులుగా ఉపయోగించుకోగలిగిన

మాంత్రికుల శక్తి ముందు, మన కత్తులూ, బాణాలూ పూచికపుల్లకు కొరగావు.'' అన్నాడు.

సమరసేనుడు, సైనికుడి మాటలు వినీవిననట్టు వూరుకున్నాడు. నల్లగూబ పక్కనే వున్న చెట్టు కొమ్మ మీద కూర్చుని, చింతనిప్పల్లాంటి కనుగుడ్లను అటూ, యిటూ తిప్పుతూ, అంతా గమనిస్తూనే వున్నది.

సమరసేనుడు, గుడ్లగూబ కేసి ఒకటి రెండు క్షణాల కాలం పరీక్షగా చూసి ఏదో మంచి ఉపాయం తోచినవాడిలా తల వూపుతూ, పక్కన వున్న సైనికుణ్ణించి విల్లంబులు అందుకుని, చప్పున దానికేసి బాణం ఎక్కుపెట్టాడు.

వెంటనే సైనికుడొకడు, ''సేనానీ! ఆ మంత్రశక్తిగల గూబ పైన మన బాణాలు పనిచెయ్యకపోవచ్చు. పైగా, దాని యజమాని అయిన మాంత్రికుడికి కోపం తెప్పించిన వాళ్ళం అవుతాం, ఆలోచించండి!'' అన్నాడు.

సమరసేనుడు బాణం దించకుండానే, ''ఆ సంగతేదో తేలుద్దాం!'' అంటూ బాణాన్ని గుడ్లగూబ మీదికి వదిలాడు. బాణం రివ్వున పోయి, సూటిగా గూబను తాకింది. అయితే, తన బాణం దెబ్బకు అది గిలగిల తన్నుకుంటూ కింద పడు




తుందని ఆశించిన సమరసేనుడికి పెద్ద ఆశాభంగమైంది.

నల్లగూబ తన రెక్కల్లో గుచ్చుకున్న బాణాన్ని ముక్కుతో అవలీలగా బయిటికి లాగి, దూరంగా విసిరివేసి, కర్ణకఠోరంగా ఒకసారి అరిచి, ''ఒరే, నరాధముల్లారా, మీరు నన్ను చంపగలమనుకుంటున్నారా? ఎంతో గొప్ప శక్తిమంతుణ్ణనుకునే ఆ ఏకాక్షి మాంత్రికుడే నన్ను ఏమీ చేయలేక పోయాడు. అటువంటిది మీరెంత? ఉండండి. కాస్త నిదానించండి! మా చతుర్నేత్రుడు వచ్చి, మీ నెత్తురు కళ్ళజూసే శుభసమయం దగ్గిరపడుతున్నది!'' అన్నది.

సమరసేనుడు ఆ మాటలతో తనూ, సైనికులూ ఎలాంటి చిక్కుల్లో పడబోతున్నదీ అర్థం చేసుకున్నాడు. అతడు సైనికులను హెచ్చరించి, అక్కడినుంచి వేగంగా పరిగెత్తసాగాడు. కాని, నల్లగూబ వాళ్ళను అనుసరించి పైన ఎగురుతూ, కేకలు పెట్టడం ప్రారంభించింది.

త్వరగా సముద్రతీరం చేరి, పడవ ఎక్కి, ఆ భయంకర ద్వీప ప్రాంతాలను వదిలిపోదామని సమరసేనుడు ఆలోచిస్తున్నాడు. కాని, గూబ అరుపులూ, మాంత్రికులు అటుకేసి రాగలరేమో అన్న భయంలో, అతడు దారి తప్పి, అరణ్యంలో చాలా దూరం వెళ్ళిపోయాడు. ఒక చోట స్థిమితంగా నిలబడి, తాను ద్వీపంలో ఏ ప్రాంతాల పడవ నుంచి దిగిందీ ఆలోచించుకోవడానికి అవకాశం యివ్వకుండా నల్లగూబ సమరసేనుణ్ణీ, సైనికులనూ వెంటాడుతూ, కర్ణకఠోరంగా అరుస్తున్నది.

"మనం దారి తప్పాం. అందుకు తోడు, యీ దీవిలో వుండే ఒకానొక మాంత్రికుడికి విరోధులమయ్యాం. ఈ పరిస్థితుల్లో మనను కుండలినీదేవి తప్ప మరెవరూ కాపాడలేరు," అన్నాడు సమరసేనుడు.

"సేనానీ, మనం ఏ విధంగా అయినా, ముందు యీ నల్ల గుడ్లగూబ దృష్టినుంచి తప్పించుకుపోవటం క్షేమం," అన్నాడొక సైనికుడు.

సమరసేనుడు జవాబివ్వబోయేంతలో, "కాలభుజంగా! కంకాళా!" అంటూ అరణ్యమంతా ప్రతిధ్వనించే కంఠస్వరం వినబడింది.

ఆ కంఠ స్వరం వింటూనే, చతుర్నేత్రుడి వేగు అయిన నల్ల గుడ్లగూబ, చెట్లపై నుంచి అరుస్తూ ఎగిరిపోయింది.

మాంత్రికుడి గూబ పీడ విరగడ అయిందని సంతోషపడుతున్న సమరసేనుణ్ణీ, సైనికులనూ, మరొకవైపు నుంచి ఏకాక్షి మాంత్రికుడి కంఠ ధ్వని భయకంపితులను చేసింది. వాళ్ళు వున్న చోటునుంచి కదిలి, కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగారు. —(ఇంకా వుంది)






# భ్రాతృహంతకుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్లి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, జీవితం స్వార్ధంతో కూడుకున్నది. ప్రతి వ్యక్తి కూడా స్వార్ధంతో ప్రేరణపొందుతాడు. అయితే స్వార్ధాన్ని ప్రేరేపించే అన్నిటిలోకీ పాపభూయిష్ఠమైనవి రాజ్యమూ, రమణీ! వాటికోసం మనుషులు ఎంతటి దారుణ కృత్యానికైనా ఒడిగట్టుతారు. ఇందుకు నిదర్శనంగా నీకు చంద్రసేనుడు అనేవాడి దురాగతం గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు:

అమరావతికి అమరసేనుడు అనేవాడు యౌవనారంభంలోనే రాజు అయాడు. కళ్ళికోటకూ, అమరావతికీ అనాదిగా

బేతాళ కథలు



శత్రుత్వం ఉండేది. అమరసేనుడి తండ్రి కాలంలో కళ్ళికోట రాజు అమరావతి కేసి చూడలేకపోయాడు. అమరసేనుడు మరీ అనుభవంలేని యువకుడు అన్న ధైర్యంతో కళ్ళికోట కాటమరాజు అమరావతి మీద ధ్వజమెత్తి వచ్చి, అమరసేనుడి చేతిలో చిత్తుగా ఓడిపోయాడు!

తరవాత కొంత కాలానికి కాటమరాజు కూతురు మణిమాలకు స్వయంవరం ఏర్పాటయింది. మణిమాల అతిలోక సుందరి అని పేరుగన్నది. ఆమె స్వయంవరానికి కాటమరాజు అందరు రాజులకూ ఆహ్వానం పంపాడుగాని, అమరసేనుడికి పంపలేదు. అమరసేనుడికి తల తీసేసినట్టయింది. అతను కాటమరాజు చేసిన అవమానం గురించి తన మంత్రితో చర్చించాడు.

''కాటమరాజు మనకు బద్ధశత్రువు. అతను ఆహ్వానం పంపలేదని మనం విచారించనవసరంలేదు. అతను ఆహ్వానం పంపినా మనం వెళ్ళకూడదు. ఎందుకంటే, శత్రువైనవాడు మంచిగా పిలిచి, ప్రాణాలుతీయవచ్చు!'' అన్నాడుమంత్రి.

కాని మంత్రి మాట అమరసేనుడికి రుచించలేదు. ఆహ్వానం అందుకున్న రాజకుమారులు తమ చిత్రపటాలను పంపినట్టే, అతను కూడా తన చిత్రపటాన్ని కాటమరాజు వద్దకు తన మనుషుల ద్వారా పంపాడు.

కాటమరాజు ఆ చిత్రపటాన్ని అందుకుంటూనే నేలకేసి కొట్టి, తన పాదరక్షలతో బాది, తెచ్చినవారికి దాన్ని తిరిగి ఇస్తూ, ''దీన్ని మీ రాజుకు ఇచ్చెయ్యండి!'' అన్నాడు.

కాటమరాజు తన పట్ల చూపిన అమర్యాద గురించి విని అమరసేనుడు తోక తొక్కిన తాచులా అయిపోయి, చిందులు తొక్కుతూ, కాటమరాజు మీద యుద్ధం ప్రకటించాడు.

ఈ సంగతి వినగానే కాటమరాజు, అమరసేనుడి తల నరికి తెచ్చినవారికి

తన కుమార్తెనిచ్చి పెళ్లి చేస్తానని ప్రకటించాడు.

మణిమాలను పెళ్లి చేసుకోవటం ఎలాగా అని మథనపడుతున్న రాజకుమారులందరూ ఒక్క పెట్టున తమ సేనలతో అమరావతి మీదికి బయలుదేరారు.

ఆ సమయానికి అమరసేనుడి తమ్ముడు చంద్రసేనుడు గురుకులంలో విద్యాభ్యాసం చేస్తున్నాడు. తన అన్నకు రానున్న ప్రమాదం గురించి విని అతను ఇంటికి వచ్చాడు. ఒక్కొక్క రాజకుమారుడూ తన సేనతో వచ్చి పడుతున్న వార్తలు తెలుస్తున్నాయి. కోట బురుజు మీదినుంచి చూస్తే, అన్నివైపుల నుంచీ సేనలు రావటం కనిపించింది. వాటిని చూసి అమరసేనుడు బెదిరాడు.

చంద్రసేనుడు అకస్మాత్తుగా కత్తి దూసి, తన చెంతనే నిలబడి ఉన్న అన్న తల నరికి, అతని మొండెం కోట కిందికి విసిరివేశాడు.

ఆ మొండెం దండెత్తి వచ్చిన రాజకుమారులందరూ చూసి, అమరసేనుడి తల ఎవరో ముందే నరికేశారనీ, ఇక తమకు మణిమాలను పెళ్ళాడే అవకాశం లేదనీ తెలుసుకుని, తమ తమ సేనలతో తిరిగి వెళ్ళారు.



తరవాత చంద్రసేనుడు తన అన్న తల తీసుకుపోయి కాటమరాజుకు చూపించి, మణిమాలను పెళ్ళాడి, అతడితో బంధుత్వమూ, స్నేహమూ కూడా చేసుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, చంద్రసేనుడు తన అన్నను అకారణంగా హత్య చెయ్యటంలో అతని ఉద్దేశమేమిటి? మణిమాల వంటి అందగత్తెను పెళ్ళాడాలనా? అన్నను చంపి తాను రాజు కావాలనా? తన బద్ధశత్రువైన అమరసేనుడి తమ్ముడని తెలిసి కూడా కాటమరాజు చంద్రసేనుడికి తన కుమార్తెనెందుకు పెళ్ళి చేశాడు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక

పోయావో నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''క్రోధావేశంతో అమరసేనుడు కాటమరాజు మీద యుద్ధం ప్రకటించి, తన చావు కోరి తెచ్చుకున్నాడు. అతను మంత్రి సలహాను పాటించి ఉండవలసింది. కాటమరాజు తనకన్న బలహీనుడన్నదే అమరసింహుడు ఆలోచించాడుగాని, మణిమాల మూలంగా అనేకమంది రాజులు కాటమరాజు పక్షం అవుతారని అతను ఆలోచించలేదు. అతను అంతమందితో పోరి జయించగల స్థితిలో లేడు. ఆ కారణంచేత అతనికి చావు ఎలాగూ మూడింది. ఈ సంగతి గ్రహించిన చంద్రసేనుడు తన అన్నను ఇతరులు చంపటంకన్న తానే చంపటంలో గల లాభం గ్రహించాడు. రాజ్యం దక్కుతుంది. కాటమరాజుతో పోరు తప్పుతుంది. బలహీనుడై ఉండి కూడా లోగడ కయ్యానికి కాలు దువ్వి, యుద్ధంలో ఓడిపోయినది కాటమరాజే. అతనికి తాను అల్లుడైతే కాటమరాజు శాంతిస్తాడు. అదే మరొకడు అల్లుడైతే, ఆ అల్లుడి సహాయంతో కాటమరాజు అమరావతి మీదికి కాలు దువ్వుతూనే ఉంటాడు. ఈ కారణాలవల్ల చంద్రసేనుడి ఆలోచన తెలివైనదే. ఇక కాటమరాజుకు తన ప్రతిజ్ఞ నిలుపుకోవటంవల్ల వచ్చిన నష్టం లేదు. తన కుమార్తెను చంద్రసేనుడికి ఇయ్యక, మళ్ళీ స్వయంవరం ఏర్పాటు చేస్తే ఇక అతని మాటకు రాజులలో ఏమాత్రమూ విలువ ఉండదు. కాటమరాజు అమరసేనుడి తల తెచ్చిన వారికే కుమార్తె నిస్తాడన్న నమ్మకంతోనే వారందరూ అమరసేనుడి మీదికి దండెత్తి వచ్చారు. అంతేగాని, వారికి అమరసేనుడితో వైరంలేదు. అందుచేత కాటమరాజు చేసిన పని కూడా వివేకంతో కూడినదే.'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజు చేయవలసిన పని

కుబేర మహారాజు రాజ్యంలో చాలామంది సంపన్నులు. పంటలు పుష్కలంగా పండుతున్నాయిగాని, రాజు ప్రజలను గురించి పట్టించుకోకుండా తన కాలం విలాసాలలో గడుపుతూ, .పరిపాలన భారాన్ని తన కింది ఉద్యోగులకు వదిలాడు. వాళ్లు కూడా విలాసాలు మరిగి, పరిపాలన గురించి పట్టించుకోవటం మానేశారు. అందువల్ల దేశంలో ధన ధాన్యాలు సమృద్ధిగా ఉన్నప్పటికీ, అవి అందవలసిన వారికి అందక మామూలు ప్రజలు ఆకలితోనూ, దారిద్ర్యం తోనూ అలమటించ సాగారు.

ఆ రాజ్యంలోనే సుచోరుడు అనే దొంగ బయలుదేరాడు. దొంగతనం వాడికి వంశ పారం పర్యంగా వస్తున్న వృత్తి. వృత్తి రీత్యా వాడు ఎన్నో ఊళ్లు తిరిగి, దేశంలో ఉన్న ధనికులు దారిద్ర్యాన్ని ఎలా సృష్టిస్తున్నదీ స్పష్టంగా గ్రహించాడు. అప్పటి నుంచీ వాడు ధనికుల ఇళ్ళు దోచి పేదప్రజలకు పంచిపెట్టడం ప్రారంభించాడు.

కొద్ది కాలంలోనే సుచోరుణ్ణి దేశంలోని సామాన్య ప్రజలు అమితంగా అభిమానించసాగారు.

సుచోరుడి దొంగతనాలను గురించి రాజుగారికి ఫిర్యాదులు వెళ్ళాయి. కాని వాణ్ణి పట్టుకునేటందుకు రాజు చేసిన ప్రయత్నా లేవీ ఫలించలేదు. ఆరితేరిన గూఢచారులకు కూడా సుచోరుడి ఆచూకీ తెలియలేదు. దానికి కారణం, వాడు చోరవిద్యలో ఆరితేరినవాడు గనక, దొంగతనం చేస్తూండగా వాణ్ణి పట్టుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. అదీగాక వాడు మామూలు మనుషులలో సులువుగా కలిసిపోయేవాడు.

"వసుంధర"

అనేక ప్రయత్నాలు విఫలమయాక రాజు సుచోరుణ్ణి పట్టుకున్న వారికి వెయ్యి వరహాలు బహుమానం ప్రకటించాడు. దానివల్ల కూడా ప్రయోజనం లేకపోయింది. బహుమానం మొత్తం వెయ్యి నుంచి పదివేల వరహాలకూ, పదివేల నుంచి లక్ష వరహాలకూ పెంచబడింది. అయినా సుచోరుడి ఆచూకీ చెప్పినవాడు లేడు. వాకబు చెయ్యగా తెలియవచ్చిందేమంటే, సుచోరుడికి సామాన్య ప్రజలలో మంచి పలుకుబడి ఉన్నదనీ, కోటి వరహాలిస్తామన్నా వాడి రహస్యం ఎవరూ బయట పెట్టరనీనూ!

అప్పుడు రాజు ఇంకో పథకం ఆలోచించాడు. సుచోరుడి ఆచూకీ తెలిసి కూడా చెప్పలేదన్న మిష మీద కొందరు అమాయకులను బంధించి, కారాగారంలో ఉంచాడు. వారిని విడిపించటానికి సుచోరుడు తనంత తానే బయటపడతాడని రాజు ఉద్దేశం. కాని అలా జరగలేదు.

పట్టరాని కోపంతో రాజు ఇద్దరు అమాయకులను ఉరి తీయించి, వాళ్ళు సుచోరుడి అనుచరులనీ, ఎన్నో ఘోరాలు చేసిన కారణంగా ఉరిశిక్ష పడ్డారనీ, సుచోరుడి అనుచరుల కందరికీ ఇదే గతి పట్టుతుందనీ దేశమంతటా దండోరా వేయించాడు.

ఇది జరిగిన మర్నాడే సుచోరుడు తనకు తానై రక్షకభటులకు పట్టుబడిపోయి, రాజు ఎదట హాజరుపెట్టబడ్డాడు.



''ఏం మనిషివి నువ్వు? నీ వాళ్లిద్దరు అన్యాయంగా చస్తేగాని బయట పడ్డావు కావు!'' అన్నాడు రాజు సుచోరుడితో.

''అన్యాయమని తెలిసి ఉండీ, వాళ్లిద్దరినీ ఉరి తీయించావు. నువ్వేమి రాజువు?'' అని సుచోరుడు రాజును అడిగాడు.

''దొంగను పట్టడానికి వేరే దారి లేనప్పుడు రాజు కొన్ని అన్యాయాలు చేయక తప్పదు. అందుకే వాళ్ళను ఉరి తీయించాను,'' అన్నాడు రాజు.

''దొంగను పట్టడానికి వేరే దారి ఎందుకు లేకపోయిందో ఆలోచించి చూశావా?'' అని సుచోరుడు మళ్ళీ అడిగాడు.

''నీ దగ్గిర దోచిన డబ్బు ఉన్నది గదా, ప్రజలకు లంచాలుపెట్టి ఉంటావు!'' అన్నాడు రాజు.

''లంచాలు ఎంతని ఇయ్యగలను? ఎంత మందికి ఇయ్యగలను? స్వార్థంతో ఎంత మందిని నా వాళ్ళను చేసుకోగలను? నేను దొంగనే కావచ్చు, కాని రాజు చేయవలసిన పని నేను చేస్తూ ఉండడం వల్ల ప్రజలు నన్ను రాజుకన్న ఎక్కువగా అభిమానిస్తున్నారు. నువు లక్ష వరహాలు ఆశపెడితే వాళ్ళు లొంగలేదు. లక్ష వరహాల కోసం నాలాటి మనిషిని వాళ్ళు వదులుకోరు. నువు అమాయకులను బంధించినప్పుడు కూడా ప్రజలు నన్ను నీ ముందుకు రానియ్య



లేదు. అమాయకులు బలి అయిపోయినా వాళ్ళు నన్ను వదులుకోవటానికి ఒప్పుకో లేదు. నేనే సహించలేక నీ ముందుకు వచ్చాను. ఇప్పుడైనా నన్ను నువ్వు ఏమీ చెయ్యలేవు. నా మీద చిన్న దెబ్బపడిందో అఖండ ప్రజావాహిని నిన్ను ముంచే స్తుంది,'' అన్నాడు సుచోరుడు.

అతని మాట రుజువు చేస్తున్నట్టుగా, అతను పట్టుబడ్డాడని తెలిసి, లక్షలాది ప్రజలు అన్ని వైపులనుంచి రాజధానికి వచ్చి, సుచోరుణ్ణి విడిచి పెట్టాలని నినాదాలు చేస్తున్నట్టు భటులద్వారా రాజుకు తెలిసింది.

ఈ సంగతి వింటూనే రాజు మరింత ఆశ్చర్యపడి, ''రాజు చెయ్యవలసిన పని నువు చేశానంటున్నావు. ఏమిటది? దొంగ తనమా?'' అని హేళనగా అడిగాడు.

''కాదు. రాజు చేయవలసిన పని ప్రజల క్షేమం కనిపెట్టడం; వాళ్ళ అవసరాలు తీర్చడం! నువ్వు అది చేయ లేదు, నేను చేశాను. అందుచేత మామూలు దొంగను అయి ఉండి, రాజుకు కూడా లొంగకపోయాను,'' అన్నాడు సుచోరుడు.

''అయితే ఇప్పుడు నీకు కావలసిన దేమిటి? ఈ దేశాన్ని ఏలాలనుకుంటు న్నావా?'' అని రాజు అడిగాడు.

''అంతటి సమర్థతా, అలాటి కోరికా నాకు లేవు. రాజు కంటె నా వంటి దొంగలే నయం అని ప్రజలు అనుకునే విధంగా మాత్రం రాజ్యాన్ని పాలించవద్దు. ప్రజా క్షేమాన్ని పట్టించుకుని పరిపాలిస్తే నావంటి దొంగలు క్షణంలో మాయమవుతారు. ఇంతకన్న నేనేమీ చెప్పలేను,'' అంటూ సుచోరుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

కుబేరుడు వాణ్ణి బంధించే ప్రయత్నం చెయ్యలేదు. ఒక దొంగవాడి పాటి పేరూ, అభిమానమూ ప్రజలలో సంపా దించుకోలేకపోయిన తన చేతకాని తనానికి సిగ్గుపడి, ఆయన అప్పటి నుంచీ విలాసాలు కట్టిపెట్టి, శ్రద్ధగా రాజ్యాన్ని ఏలసాగాడు.





# పరాయిసొత్తు

చీకటి పడి పెద్దగా వర్షం ప్రారంభ మయింది. అప్పుడే భోజనం ముగించిన లక్ష్మయ్య వీధి తలుపు మూయటానికి వెళ్లి, వీధి అరుగుమీద నిలబడి ఉన్న మనిషిని చూశాడు. ఆ మనిషి వానకు తడిసి, తన బట్టతలను పొడి బట్టతో తుడుచుకుంటున్నాడు. అతని చంకలో ఒక బట్టల మూట ఉన్నది. అతని కుడి చేతికి ఆరో వేలు ఉన్నది.

లక్ష్మయ్య ఆ మనిషిని పోల్చుకుని, "బాగా తడిసినట్టున్నారు. లోపలికి వచ్చి బట్టలు మార్చుకోండి!'' అని అతన్ని ఆహ్వానించాడు.

''కృతజ్ఞుణ్ణి!'' అంటూ ఆ మనిషి లోపలికి వచ్చాడు. అతని బట్టలు చూస్తే చాలా పేదవాడిలాగా కనిపించాడు. అతను లోపలి గదిలో బట్టలు మార్చుకుని, తడి బట్టలు ఆరవేస్తూండగా, వంటగది సర్ది ఇవతలికి వచ్చిన మంగమ్మ అతన్ని చూసింది. ఆమె తన భర్తను లోపలికి పిలిచి, ''దారే పొయ్యే దరిద్రాన్ని ఇంట్లోకి తెచ్చుకున్నావా? హవ్వ!'' అంటూ బుగ్గలు నొక్కుకున్నది.

''దరిద్రుడైతేనేం? అతను మనకు అతిథి! వంట ప్రారంభించు," అన్నాడు లక్ష్మయ్య భార్యతో.

''ఇది మరీ బాగుంది! లోపలికి ఆహ్వానించింది చాలక విందు కూడానా? వర్షం కాస్త నిలవగానే ఆ దరిద్రుణ్ణి సాగనంపు!'' అన్నది మంగమ్మ.

భార్య నస భరించలేక లక్ష్మయ్య వీధి గదిలోకి వెళ్లి బయటికి చూస్తే, వాన తగ్గే లక్షణాలు కనిపించలేదు. అతను మళ్లీ భార్య వద్దకు తిరిగివచ్చి, ''వాన తగ్గేటట్టు లేదు. తిండి పెట్టకపోతే మానె, చాప ఇచ్చి పడుకోమందాం!'' అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు



ఇయ్యమని తండ్రిని అడిగాడు. తండ్రి ఇయ్యలేదు. ఒక స్నేహితుడి ప్రేరణతో లక్ష్మయ్య ఇంటి నుంచి రెండు వేల రూపాయలు దొంగతనం చేసి, ఇంకో ఊరు వెళ్ళాడు. అక్కడ ఆ స్నేహితుడు వాడి చేత ఏదో వ్యాపారం చేయించబోతున్నట్టు నటించి, ఆ డబ్బు కాజేసి, లక్ష్మయ్యను కట్టుబట్టలతో వదిలాడు.

తనకోసం తండ్రి వస్తున్నట్టు లక్ష్మయ్యకు తెలిసింది. వాడు ఆ ఊరు వదిలి పెట్టి అడివి దారిన ప్రయాణంసాగించాడు.

ఒక కొండవాగు దగ్గిర ఒక మనిషి, స్నానం చేసి ఒళ్ళు తుడుచుకుంటూ కనిపించాడు. అతని తల బట్టతల, అతని కుడిచేతికి ఆరు వేళ్ళు!

ఆ మనిషి వెనకగా గట్టు మీద ఒక పెట్టె ఉన్నది. ఆ మనిషి తనను చూడ లేదని తెలుసుకుని, లక్ష్మయ్య ఆ పెట్టెను తీసుకుని, వచ్చిన దారి పట్టాడు. కొంత దూరం వచ్చి చూసుకుంటే ఆ పెట్టెలో సగందాకా బంగారు కాసులు ఉన్నాయి.

లక్ష్మయ్య పరమానందం చెంది, ఇంటికి చేరుకుని, తండ్రికి బంగారు కాసులు చూపి, ''ఇదుగో, నేను సంపాదించిన డబ్బు!'' అన్నాడు.

''నువు చేసిన వ్యాపారం ఏమిటి ?'' అని తండ్రి అడిగాడు, అనుమానంగా.

''అదేమీ కుదరదు! అర్థమైనవాళ్లకూ ఆశ్రయమిస్తే ఇల్లు దోచుకుపోతారు!'' అన్నది మంగమ్మ.

''ఆ మనిషి ఎవరో తెలిస్తే నువు ఆ మాట అనవు,'' అంటూ లక్ష్మయ్య తన పెళ్ళికి పూర్వం జరిగిన సంగతులు మంగమ్మకు చెప్పాడు.

లక్ష్మయ్య చిన్నతనమంతా చదువూ, సంధ్యా లేకుండా గడిపి, గాలికి తిరిగి, ఇరవై ఏళ్ళు వచ్చేసరికి ఎందుకూ పనికి రాకుండా తయారయాడు. వాడి స్నేహితులందరూ పనికిమాలినవాళ్ళే. వాడికి ఉద్యోగం ఎవరూ ఇయ్యరు గనక, వ్యాపారం చేస్తానంటూ, పెట్టుబడికి డబ్బు

"అదేమీ అడగవద్దు! ఈ డబ్బుతో నేను ఇక్కడ బట్టల వ్యాపారం ప్రారంభిస్తాను," అన్నాడు లక్ష్మయ్య.

లక్ష్మయ్యకు వ్యాపారం కలిసివచ్చింది. ఏడాది తిరగకుండానే అతను మంగమ్మను పెళ్ళి చేసుకుని, పైకి వచ్చాడు.

ఇదంతా భార్యకు చెప్పి, "ఇప్పుడు మనం అనుభవిస్తున్న భోగం అంతా ఇతని చలవే! అతను మనకు దేవుడు!" అన్నాడు లక్ష్మయ్య.

"ఆ డబ్బు అతనికి ప్రాప్తంలేదు. అతన్ని వెంటనే వెళ్ళగొట్టకపోతే మొదటికే మోసం వస్తుంది!" అన్నది మంగమ్మ ఆందోళనతో.

లక్ష్మయ్య అంత వర్షంలో అతన్ని పొమ్మనలేక పోయాడు; అతనికి పడుకునేటందుకు ఒక చాప ఇచ్చి, మాటల సందర్భంలో అతని పేరు రామయ్య అనీ, అతను ఒక కోమటి గుమాస్తా అనీ తెలుసుకున్నాడు.

అతిథిని తన సలహా ప్రకారం వెళ్ళగొట్టనందుకు మొగుణ్ణి అనవలసిన మాటలన్నీ అని, మంగమ్మ నిద్రపోయింది. కాని లక్ష్మయ్యకు నిద్ర పట్టలేదు. రామయ్య కటిక దారిద్ర్యంలో ఉన్నాడు! అతనికి తాను ఏదన్నా సహాయం చెయ్యాలి!



"చాలాసేపు ఆలోచించి, లక్ష్మయ్య అయిదువేల రూపాయలు మూటగట్టి, రహస్యంగా దాన్ని రామయ్య బట్టల మూటలో పెట్టి, నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారగానే రామయ్య లక్ష్మయ్యకు తన కృతజ్ఞత తెలుపుకుని, సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. అయితే అతను మధ్యాన్నానికల్లా మళ్ళీ వచ్చి, "ఇది నా బట్టల మూటలోకి ఎలా వచ్చిందో, వచ్చింది! ఎందుకు వచ్చిందో నాకు తెలీదు! మీ ఇంట్లోనే ఇది వచ్చింది గనక, దీన్ని మీరు తీసుకోండి," అంటూ లక్ష్మయ్య డబ్బుమూట లక్ష్మయ్య చేతిలో పెట్టాడు.

అతని నిజాయితీకి లక్ష్మయ్య కళ్ళలో నీళ్లు తిరిగాయి. ఇటువంటి మనిషి డబ్బు తాను కాజేశాడు!

నేనే ఆ డబ్బు మీ మూటలో ఉంచాను. మీ పరిస్థితి ఏమీ బాగున్నట్టు లేదు. ఈ డబ్బు మీరు ఉంచుకోండి," అన్నాడు లక్ష్మయ్య.

రామయ్య నవ్వి, "పరాయి సొత్తు నా ఆరోవేలు వంటిది—ఎందుకూ పనికి రాదు! అది తింటే అరగదు! దాంతో కొన్న ఇంట్లో సుఖం ఉండదు! బట్ట కొంటే దానికి అందం ఉండదు! అది నాకు వద్దు. నా కష్టార్జితం నాకు చాలు," అన్నాడు.

లక్ష్మయ్య ఇక ఉండ బట్టలేక, తాను పెట్టె దొంగతనం చేసిన కథ అంతా రామయ్యకు చెప్పేసి, "క్షమించాలి! నా సంపద అంతా మీదే! ఇది మీకు పరాయిసొత్తు కానేకాదు," అన్నాడు.

రామయ్య కొంచెం ఆశ్చర్యపడి, "ఆ రోజు ఆ వాగు దగ్గిర స్నానం చేసినది నేనే. కాని ఆ పెట్టె నాది కాదు. అసలు నేనా పెట్టెను చూడనైనా లేదు. ఆ పెట్టె గలవాణ్ణి ఏ పులి అయినా ఎత్తుకు పోయిందో ఏమో! అది మీకు దొరికింది. నాకు సెలవిప్పించండి, చాలా దూరం వెళ్ళాలి!" అంటూ వెళ్ళిపోయాడు.

రామయ్య మాటలు లక్ష్మయ్య చెవిలో కంగున మోగుతూనే ఉన్నాయి. అందులో నిజం కూడా ఉన్నట్టు అనిపించింది. తనకు ఈ ఇంట్లో సుఖం లేదు. తిన్నది రుచించదు. తనకు అజీర్తిరోగం! తన స్థూలశరీరం వికారంగా ఉన్నమాట కూడా నిజమే.

సమయానికి మంగమ్మ ఇంట లేనందుకు లక్ష్మయ్య సంతోషించాడు. అతను అటక మీది నుంచి తనకు దొరికిన పెట్టెను దించి, దాని నిండా బంగారు కాసులు పోసి తీసుకుపోయి, గ్రామాధికారికి ఇచ్చి, "దీన్ని ప్రజాసౌకర్యాలకు వినియోగించండి," అని చెప్పి, ఇంటికి తిరిగి వచ్చాడు.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించేటప్పుడు బోధిసత్వుడు ఒక వర్తక కుటుంబంలో జన్మించాడు. పెద్దవాడై అతను అయిదువందల బండ్ల మీద సరకు వేసుకుని తూర్పు నుంచి పడమరకూ, పడమర నుంచి తూర్పుకూ వెళ్ళి వర్తకం చేసేవాడు.

కాశీనగరంలోనే మందమతి అయిన మరొక వర్తకుడు ఉన్నాడు. అతను ఉపాయహీనుడు కూడానూ. ఒకసారి బోధిసత్వుడు తన బండ్ల మీద సరకు వేసుకుని, ప్రయాణానికి సిద్ధంగా ఉండగా, మందమతి తాను కూడా అదే సమయంలో బయలుదేరుతానన్నాడు.

బోధిసత్వుడు మందమతితో, "నీ బళ్ళూ, నా బళ్ళూ ఒక్కసారిగా బయలుదేరితే, దారి ఇరుకై, ఇబ్బంది కలగవచ్చు. అందుచేత ఒకరి వెనుక ఒకరు బయలుదేరటమే మంచిది. ముందు నువు బయలుదేరుతావా, లేక నన్ను బయలుదేరమన్నావా? నీ యిష్టప్రకారమే చేతాం," అన్నాడు.

మందమతి తనలో ఇలా అనుకున్నాడు:

"ముందు నేను పోయినట్టయితే చాలా లాభాలుంటాయి. దారి నలగదు. పశువులకు మంచి పచ్చికా, మనుషులకు మంచి కూరలూ లభించవచ్చు. నిర్మలమైన నీరు లభ్యమవుతుంది. సరకుల ధరలు నా ఇష్టప్రకారం నిర్ణయించవచ్చు."

బోధిసత్వుడు తనలో ఇలా అనుకున్నాడు:

"ఒకరు తొక్కిన దారిన ప్రయాణించటం తేలిక. ఒకసారి పశువులు మేసిన చోట గడ్డి మళ్ళీ చిగురు పట్టినప్పుడు రెండింతలు అవుతుంది. కూర



గాయలు కూడా అంతే. ముందు వెళ్ళిన వారు నీటి ఒనరులు కష్టపడి కనిపెడ తారు, లేదా నీటికోసం బావులు తవ్వు తారు. అవి తరవాత వెళ్లేవారికి ఉపయోగ పడతాయి. కొత్త చోటికి మొదటిసారిగా వెళ్లి ధరలను గురించి బేరాలాడటం అంత మంచిది కాదు. ముందు వెళ్లిన వాళ్ళు నిర్ణయించిన ధరలకు వెనక వెళ్ళే వాళ్లు మంచిగా వర్తకం చేసుకోవచ్చు.''

ఇలా అనుకుని మందమతి ముందు తాను పోతాననేసరికి బోధిసత్వుడు సంతో షంగా ఒప్పుకున్నాడు.

మందమతి వెళ్ళవలసిన చోటు అరవై యోజనాల దూరాన ఉన్నది. మధ్యలో పెద్ద ఎడారి ఉన్నది. అందుచేత ప్రయా ణానికి అవసరమైన తినుబండారాలూ, పీపాలతో తాగటానికి నీరూ సిద్ధం చేసు కుని మందమతి బోధిసత్వుడికి మంచి టోపీ వేశాననుకుని సంతోషంగా బయలు దేరాడు.

మందమతి బిడారు చాలా దూరం ప్రయాణం చేసి, ఎడారి చేరుకున్నది. అందులో కొంత దూరం వెళ్ళేసరికి మందమతికి ఒక అపూర్వమైన వాహనం ఎదురయింది. దానికి ఉత్తమ జాతి ఎద్దులు, తెల్లనివి, పూన్చి ఉన్నాయి. అందులో ఒక రాజపురుషుడు ఉన్నాడు. ఆ బండి ముందు సేవకులు కత్తులూ, కటార్లూ, విల్లమ్ములూ ధరించి నడుస్తున్నారు. బండి చక్రాలకు బురద అంటి ఉన్నది. అందరి తలలకూ తామర తూండ్లు చుట్టి ఉన్నాయి. వారి చేతుల్లో తామరపూలు ఉన్నాయి.

రాజపురుషుడు మందమతితో, ''ఏం వర్షం! కుంభపోతగా ఒకటే వాన! అదుగో, ఆ ప్రాంతమంతా జలమయమే. ఏళ్ళూ, ఊళ్ళూ ఏకమైపోయాయి! మీరు అటే పోతున్నారుగదా, ఈ పీపాలతో నీరేమిటి? ఎందుకొచ్చిన బరువు? నీరు పారబోసి తేలికగా వెళ్ళండి,'' అని సలహా ఇచ్చాడు.

ఆ రథంలో ఉన్నవాడూ, వాడి పరివారమూ నరభక్షకులైన యక్షులు. వాళ్ళు ఎడారి ప్రయాణీకులను ఇలాగే వంచించి, వారు తిండికి మాడి, దాహంతో చచ్చినాక వాళ్ళను పీక్కు తింటారు.

ఈ సంగతి గ్రహించక మందమతి తన బండ్లలోని పీపాలన్నీ ఖాళీ చేయించి, ముందుకు కదిలాడు. దూరాన రాజ పురుషుడు చూపిన అడవి కనబడుతున్నదే గాని, ఎంత దూరం వెళ్ళినా అది చేరువ కాలేదు.

అందరూ దాహంతో బాధపడుతున్నారు. తాగటానికి నీటిచుక్క కూడా లేదు. గొంతులు ఎండిపోయి ఒక్కొక్కరే మరణించసాగారు. క్రమంగా ఎద్లు కూడా సొలిపోయాయి. చచ్చిన మనుషులనూ, పశువులనూ యక్షులు తినేసి, అస్థిపంజరాలను ఎడారి ఇసుకలో వదిలేశారు.

నలభై అయిదు రోజులు గడవనిచ్చి, బోధిసత్వుడు కూడా తన బిడారుతో అదే తోవన బయలుదేరాడు. అతను కూడా ప్రయాణానికి అవసరమైన తినుబండారాలూ, పీపాలతో నీరూ సమకూర్చుకున్నాడు. వాళ్లు ఎడారి ప్రాంతం చేరగానే బోధిసత్వుడు తన మనుషులతో, "నాతో చెప్పకుండా ఎవరూ ఒక్క చుక్క నీరు పారబోయవద్దు. ఇలాటి ఎడారిలో విషవృక్షాలుంటాయి. నాకు చెప్పకుండా కొత్త రకం కాయగాని, ఆకుగాని ఎవరూ తినవద్దు," అన్నాడు.



బిడారు కొంత దూరం వెళ్లేసరికి రాజ పురుషుడు తన బండిలో ఎదురుపడి, మందమతితో చెప్పినట్టే చెప్పాడు. అతనితో బోధిసత్వుడు, "మీ దారిన మీరు వెళ్ళండి. మేం వర్తకులం. ఇంకో చోట నీరు కనబడితేగాని ఉన్న నీరు పారబోయం. అప్పుడు బరువు తగ్గించు కుంటాం," అన్నాడు.

యక్షుడు వెళ్లిపోయాడు.

అతని మాటలు నమ్మి సేవకులు కొందరు నీరు పారబోద్దామన్నారు. బోధిసత్వుడు వారితో ఇలా అన్నాడు:

"ఈ ప్రాంతంలో జలాశయం ఏదన్నా ఉన్నట్టు మీరు ఎప్పుడైనా విన్నారా? ఆ మనిషి కుంభపోతగా వర్షం కురిసిం దన్నాడు. తడిగాలి ఏమైనా వీచిందా? ఆకాశంలో ఎక్కడైనా మబ్బు తునక లాటిది కనబడుతున్నదా? మెరుపులు కనబడ్డాయా? ఉరుములు వినబడ్డాయా? మనం చూసినవాళ్ళు యక్షులు. మనం శోషపడిపోతే తినటానికి ఎత్తు వేశారు. మన ముందు పోయిన వర్తకుణ్ణీ, అతని మనుషులనూ తినేసే ఉంటారు. వాళ్ళ అస్థిపంజరాలు మనకు కనబడవచ్చు కూడా!"

అతను చెప్పినట్టే, బిడారు కొంత దూరం వెళ్ళేసరికి, మందమతి తాలూకు అయిదువందల బళ్ళూ, వాటిలోని వర్తక సరుకులు కనిపించాయి. వాటి చుట్టూ మనుషులవీ, పశువులవీ అస్థిపంజరాలు చెదురు మదురుగా పడిఉన్నాయి.

"చూశారా? మందమతి దూరాలోచన చెయ్యక, నీరు పారబోసుకోవటం వల్ల ఏం జరిగిందో?" అన్నాడు బోధిసత్వుడు.

ఆ ప్రాంతంలోనే ఆ రాత్రి మజిలీ చేసి, బోధిసత్వుడు, మర్నాడు ఉదయం, చచ్చిపోయిన వర్తకుడి బళ్ళలో చెడి పోనివీ, సరుకులలో బాగా ఉన్నవీ తన వెంట తీసుకుని గమ్యస్థానానికి వెళ్ళి, లాభసాటిగా తన దేశానికి తిరిగి వచ్చాడు. ఈ ప్రయాణంలో అతనికి ఒక్క ప్రాణి కూడా నష్టం కాలేదు.





# లోకోత్తర శోధన

"రాజకుమారుడు కష్టాలను చూడ రాదు, కష్టాలను గురించి వినరాదు," అని శుద్ధోదన మహారాజు ఉత్తరువు లిచ్చాడు. సిద్ధార్థుడికి సకల సుఖాలను ఆయన అమర్చాడు. అతని వినోదం కొరకు ఉత్తమ నర్తకులూ, గాయనులూ నియోగించబడ్డారు.

యశోధరకు కొడుకు కలిగాడు. తన కొడుకు అప్పుడప్పుడూ వైరాగ్య ధోరణిలో ఉండటం చూసి అతని భవిష్యత్తు గురించి భయపడిన శుద్ధోదనుడు, సిద్ధార్థుణ్ణి కొడుకు ఇంటి నుండి కదలనివ్వడని రూఢిచేసుకున్నాడు.





ఒకరోజు, సిద్ధార్థుడు తన తండ్రి అనుమతితో, ఉద్యానానికి బయలుదేరాడు. దారిలో అతనికి ఒక వృద్ధుడు వంగిపోయి కనబడ్డాడు. మరొకసారి అతనికొక రోగగ్రస్తుడూ, ఇంకొకసారి చనిపోయినవాడూ కనిపించారు. అతను కలవరపడ్డాడు. అతను ఎన్నడూ అలాటి దృశ్యాలు చూసి ఉండలేదు.



నాలుగోసారి అతనికి కనిపించిన సన్యాసి ఎంతో శాంతంగా ఉన్నాడు. రాజ కుమారుడి ప్రశ్నలకు సమాధానంగా చెన్నుడు, వార్ధక్యమూ, వ్యాధీ, చావూ అందరు మానవులకూ వస్తాయని చెప్పాడు. సన్యాసి లోకంలో బంధాలన్నిటినీ తెంచుకుని, దేవుణ్ణి అన్వేషిస్తున్నట్టు చెన్నుడు చెప్పాడు.

సిద్ధార్థుడు ఈ అనుభవాలను గురించి మననం చెయ్యసాగాడు. మనిషి ఎందుకు బాధపడతాడు? లోకం నుంచి సంతృప్తి లభించే మాటైతే సన్యాసంతో పని ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవాలని అతను ఒక రాత్రి ఇంటి నుంచి వెళ్ళిపోయాడు.






రాజసౌధ ద్వారం వద్ద ఒక వింత ఆకారం కనిపించి, "రాజకుమారా, నీకు గొప్ప కీర్తి, సౌఖ్యమూ లభిస్తుంది.. నువ్వు రాజాధిరాజు వవుతావు. వెళ్ళిపోకు!" అని రహస్యంగా అన్నది. అలా అన్నది మారుడు, అన్వేషకులను తప్పుదారి పట్టించే దుష్టశక్తి!

సిద్ధార్థుడు గుర్రం మీద ఎక్కి తన అనుచరుడైన చెన్నుణ్ణి తన వెంట రమ్మన్నాడు. అరణ్య ప్రాంతం చేరుతూనే అతను గుర్రం దిగి, దాన్ని తీసుకుని రాజభవనానికి తిరిగి వెళ్ళమని చెన్నుడికి చెప్పాడు. తరవాత అతను తన దీర్ఘకేశాలను ఒక్క కత్తివేటుతో నరికేశాడు.






మర్నాడు ఉదయం చెన్నుడు రాజకుమారుడి నిష్క్రమణం గురించి రాజభవనంలో రాజుకూ, ఇతరులకూ వెల్లడించాడు. అదే సమయంలో అరణ్యం అవతలి వైపున సిద్ధార్థుడు తన దుస్తులను ఒక బిచ్చగాడి దుస్తులతో మార్చుకున్నాడు.

సిద్ధార్థుడు అనేక ప్రదేశాలకు వెళ్ళి, ప్రసిద్ధులైన జ్ఞానులను కలుసుకుని, వారికి తెలిసినదంతా తెలుసుకున్నాడు. కాని సత్యం తాను స్వయంగా శోధించవలసిందేనని అతనికి తోచింది. ధ్యాననిష్ఠకు తగిన స్థలం కోసం అతను వెతికాడు.





సిద్ధార్థుడు ఉరువేలవనం చేరి, ఒక వటవృక్షం కింద కూర్చుని. ధ్యాననిష్ఠలో మునిగిపోయాడు. అయిదుగురు సంచారతాపసులు అతన్ని చూసి, మహాపురుషుడని గ్రహించి, అతనికి శుశ్రూషలు చేశారు. సిద్ధార్థుడు ఆత్మాన్వేషణలో ఆరేళ్లు గడిపాడు.

శరీరాన్ని తపింప జేయటంవల్ల తన లక్ష్యం సిద్ధించదని అతనికి చివరకు తెలిసిపోయింది. సుజాత అనే యువతి తనకోసం తెచ్చి ఇచ్చిన ఆహారాన్ని అతను స్వీకరించాడు. అతనికి నిష్ఠాభంగం అయిందనుకుని అతని అయిదుగురు శిష్యులూ అతన్ని విడిచి వెళ్లిపోయారు.





సిద్ధార్థుడు నదీతీరాన ఉన్న బోధివృక్షం కిందికి మారాడు. అది పౌర్ణమి రాత్రి. అతను తనను శాంతి ఆవరించినట్టూ, తనలో గొప్ప కాంతి వికాసం కలిగినట్టూ భావించాడు. అతనికి జ్ఞానోదయం అయింది. అతను బుద్ధత్వంపొందాడు.



# దొరకని దొంగ

రత్ననాభుడు అనే నగల వర్తకుడి వద్ద విఠలుడు అనే కుర్రవాడు ఒళ్ళు దాచుకోకుండానూ, ఎంతో నమ్మకంగానూ పని చేస్తూండేవాడు. యజమానికి తన మీద గుడ్డినమ్మకం ఉన్నదని వాడికి తెలుసు. దాని ఆధారంగా దొంగతనం ఒకటి చెయ్యాలని వాడికి అకస్మాత్తుగా దుర్బుద్ధి పుట్టింది. ఒక రోజు అంగడి మూసే సమయంలో వాడు కొత్తగా తయారైన రత్నహారాన్ని తన దుస్తుల్లో దాచి ఇంటికి పట్టుకుపోయాడు.

మరునాడు అంగడికి వస్తూనే రత్నహారం పోయినట్టు రత్ననాభుడు గమనించాడు. ఆ హారం జమీందారు గారి కోసం ప్రత్యేకంగా చేసినది. దాన్ని ఈరోజే పంపెయ్యాలి. అందుకని రత్ననాభుడు దాని కోసం చూడటం జరిగింది. హారం ఉంచిన పెట్టె ఉన్నదిగాని, అందులో ఉండవలసిన హారం మటుకు మాయమయింది.

రత్ననాభుడు విస్తుపోయాడు. తన అంగడిలో దొంగతనం జరగటం ఇదే మొదలు. అంగడిలో విఠలుడు కాక మరి ఇద్దరు కూడా పని చేస్తున్నారు. వాళ్ళిద్దరూ ఎన్నో ఏళ్ళుగా, ఎంతో నమ్మకంగా పని చేస్తున్నారు. నిజానికి విఠలుడే కొత్తవాడు. అయినా రత్ననాభుడికి వాణ్ణి అనుమానించ బుద్ధికాలేదు. రత్ననాభుడు వాణ్ణి కొంతకాలం వెయ్యికళ్ళతో కనిపెట్టి, వాడిలో దొంగబుద్ధి ఏ కోశానాలేదన్న నిర్ధారణకు వచ్చాడు. అందుచేత రత్ననాభుడు ఎవరినీ అనుమానించ లేని సంకట పరిస్థితిలో పడ్డాడు. అతనికి ఒక్కటే మార్గం తట్టింది. దొంగతనం గురించి చెప్పకుండా, దుకాణంలో పని చేసే ముగ్గురినీ సూక్ష్మంగా పరిశీలించటం.

బొమ్మిడి అచ్చారావు



అంగడిలో పనిచేసే ముగ్గురూ తమ పనులు చేసుకుంటూ పోతున్నారు. ఇంతలో ధనపతి అనే తోటి వ్యాపారి రత్ననాభుడి అంగడికి వచ్చి కూర్చుంటూనే, ''ఈ సంగతి విన్నావా? మా అంగట్లో దొంగతనం జరిగింది!'' అన్నాడు ఆయాసపడుతూ.

''నీ అంగట్లో దొంగతనమా? దొంగ దొరికాడా?'' అని రత్ననాభుడు ఆశ్చర్యంగా అడిగాడు.

''దొరక్క. ఏం జేస్తాడు? నిన్న సాయంకాలం ఆలస్యంగా అంగడి మూశాను. తాళం పెట్టేముందు, నా అలవాటు ప్రకారం నగలన్నీ చూసుకుంటే, ఒక కంఠహారం కనిపించలేదు. వెంటనే పని వాళ్ళను ఆపి సోదాచేశాను. ఎన్నాళ్లుగానో నమ్మకంగా పని చేస్తున్న రంగన్నే దాన్ని తన గుడ్డల్లో దాచేసుకున్నాడు. కాలమహిమ! వాడిమీద నాకు ఎంత నమ్మకం అనుకున్నావు!'' అన్నాడు ధనపతి.

''మరి వాణ్ణి ఏం చేశావు? రక్షక భటులకు అప్పగించావా?'' అని రత్ననాభుడు ధనపతిని అడిగాడు, తన పని వాళ్ళను క్రీగంట గమనిస్తూ.

''అంత పని దేనికిలే? దేహశుద్ధి చేసి పంపేశాను! ఎంతోకాలం నమ్మకంగా పని చేశాడు. వాణ్ణి దండించి నాకు ఏం ఒరుగుతుంది? నగ దొరికింది గదా! నమ్మకం పోగొట్టుకున్నాడు. అదే వాడికి శిక్ష.'' అన్నాడు ధనపతి.

''చాలా పొరపాటు చేశావు! అలాటి వాణ్ణి అంత తేలికగా వదలరాదు! నేనయితే దేహశుద్ధితో బాటు వాడికి శిక్ష వేయించే వాణ్ణి!'' అన్నాడు రత్ననాభుడు.

అతను ఈ మాట అంటూండగానే విఠలుడి చేతిలోని మంచినీటి కూజా జారి కిందపడింది. తన మాటలకు విఠలుడిలో కలిగిన మార్పు గమనించిన రత్ననాభుడికి మొదటిసారిగా వాడి మీద అనుమానం కలిగింది. మిగిలిన ఇద్దరి లాగా కాక,

విఠలుడు తమ సంభాషణను జాగ్రత్తగా వింటున్నట్టు కూడా రత్నానాభుడికి పొడగట్టింది.

ధనపతి వెళ్ళిపోయాడు.

విఠలుడి మనసు బాగా వికలమయింది. వాడి మనసులో రక్షకభటులు మెదులుతున్నారు. కారాగృహం కనిపిస్తున్నది. వాడి ప్రతి కదలికా వాడికే అనుమానాస్పదంగా ఉన్నది.

ఈ పరిస్థితి ఎంతో సేపు భరించలేక వాడు తన యజమానితో, ''ఈ రోజు నాకు ఒంట్లో బాగాలేదు. సెలవు ఇప్పించండి," అన్నాడు.

రత్నానాభుడు ఆశ్చర్యం నటిస్తూ, ''అదేమిటి? ఒంట్లో బాగా లేకపోతే పనిలోకి ఎందు కొచ్చావు? రాలేనని కబురు పెడితే నేను కాదంటానా?'' అన్నాడు.

విఠలుడే ఏ కారణం చేతనో కక్కుర్తి పడి హారాన్ని దొంగిలించినట్టు వాడి ముఖం చూస్తేనే తెలుస్తున్నది. ఆ సంగతి తనకు తెలిసినట్టు వాడికి తెలియనియ్యకుండా, వాడు తన తప్పు దిద్దుకునేటట్టు చేయాలి.

''చూడు, విఠలా! నీకు ఇవాళ ఒక సంగతి చెబుదామనుకున్నాను,'' అని రత్నానాభుడు ఆగాడు.

విఠలుడి ముఖంలో రక్తంలేకుండా పోతున్నది. వాడు యజమానివంక సూటిగా చూడలేకుండా ఉన్నాడు.



''మరేమీ లేదు. నువు ఒళ్ళుదాచుకో కుండా పని చెయ్యటమే గాక, ఎంతో నమ్మకంగా మసలుతున్నావు. నీ జీతం ఈ రోజు నుంచీ యాభై రూపాయలు పెంచుతున్నాను," అన్నాడు రత్ననాభుడు.

విఠలుడు తన యజమానిని నమ్మ లేనట్టు చూశాడు. వాడి ముఖం రంగులు మారుతున్నది. తన యజమాని పిల్లి ఎలుకతో లాగా తనతో చెరలాటలాడు తున్నాడా? ఏమైనా తాను దొంగతనం చెయ్యటం బుద్ధితక్కువ అని వాడికి స్పష్టమయింది.

''ఏం, మాట్లాడవేం?'' అని రత్న నాభుడు వాణ్ణి అడిగాడు.

''తమ దయ!'' అన్నాడు విఠలుడు. ఆ క్షణంలో వాణ్ణి ఆదుకునేది యజమాని దయ తప్ప మరేదీలేదు.

''సరే వెళ్ళు! నీ ఒంట్లో బాగున్నాక నే పనిలోకి రా!.... అన్నట్టు జమీందారుగారి హారం ఇవాళేగదా ఇస్తామన్నాం? దాన్ని తీసుకుపోయి వారికిచ్చి, మజూరీ డబ్బు పుచ్చుకుని, నువు మళ్ళీ పనిలోకి వచ్చేటప్పుడు పట్టుకురా!'' అన్నాడు రత్ననాభుడు.

విఠలుడికి పోతున్న ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. పెట్టెలో హారం లేని సంగతి తన యజమానికింకా తెలియదని వాడికి ధైర్యం వచ్చింది. వాడు ఆ పెట్టెను తీసుకుని, ఉత్సాహంగా, ''అలాగే, బాబూ!'' అంటూ హడావుడిగా వెళ్ళి పోయాడు.

వాడు ఇంటికి పోయి, తాను దొంగిలిం చిన హారాన్ని ఆ ఖాళీ పెట్టెలో పెట్టి, జమీందారుగారి ఇంట ఇచ్చి, మజూరీ డబ్బులు వసూలు చేసి, మర్నాడు తెచ్చి యజమానికి ఇచ్చాడు.

''నీ జబ్బు నయమయినట్టేనా?'' అని యజమాని నవ్వుతూ అడిగేసరికి, యజమానికి అంతా తెలుసునని విఠలుడు గ్రహించాడు.

''ఇంక దాపరికం దేనికి? నిన్ననే నయమయింది, బాబూ!'' అన్నాడు వాడు.



# సరి అయిన నిర్ణయం

కన్నయ్య పొరుగున ఉండే హరిదాసు వట్టి పోట్లగొడ్డు. పొరుగున ఉన్న పాపానికి కన్నయ్య మీద అతను ప్రతిదానికీ కాలు దువ్వేవాడు. కన్నయ్య ఎంతో సాత్వికుడై కూడా హరిదాసు మీద తరచు కేకలు వెయ్యవలసి వచ్చేది.

కన్నయ్య దొడ్లో ఉన్న కొబ్బరిచెట్టు పెరిగి, పూర్తిగా హరిదాసు దొడ్లోకి వంగిపోయింది. ఆ కారణాన కన్నయ్య, హరిదాసు దొడ్డిలో రాలిపడిన కాయలు హరిదాసునే తీసుకోనిచ్చేవాడు. కాని హరిదాసుకు అలా తృప్తికలగలేదు. ఒకసారి అతను కన్నయ్య కొబ్బరిచెట్టుకు కాచిన గెల ఒకటి పక్వానికి వస్తుండగా తానే కోసేసుకున్నాడు.

ఇందుకు కన్నయ్య అభ్యంతరం చెప్పాడు. హరిదాసు కన్నయ్యను తిట్టిపోశాడు. కన్నయ్య గ్రామాధికారితో చెప్పుకున్నాడు. గ్రామాధికారి వచ్చి హరిదాసుతో, "ఇదేం పని? కన్నయ్య నాటి, నీరు పోసి పెంచిన చెట్టు కాయలన్నీ నువు తీసుకోవటం న్యాయమా?" అన్నాడు.

"ఎవరు పెంచితే ఏమండీ? చెట్టు తల నా ఆవరణలో ఉన్నది. దానికి కాసిన కాయలన్నీ నావే!" అన్నాడు హరిదాసు.

గ్రామాధికారి కన్నయ్య కేసి తిరిగి, "హరిదాసు మాట కాదనటానికి లేదు. కొబ్బరిచెట్టు తల అతని ఆవరణలో ఉంటే, చెట్టు మొదలు నీ ఆవరణలో ఉన్నది. దాని కాయలు నీ కెలాగూ దక్కవు గనక, దాని మొదలు నరికించెయ్యి. చెట్టు విరిగి పడి అతని పశువుల పాకా, ఇంటి చూరూ విరిగితే నీ తప్పు లేదని నేను తీర్పు చెబుతాను," అన్నాడు.

వెంటనే హరిదాసు కొబ్బరికాయల గెల తెచ్చి కన్నయ్యకు ఇచ్చుకున్నాడు. అందులో నుంచి కొన్ని కాయలు తీసి కన్నయ్య హరిదాసుకు ఇచ్చాడు. — గుండాల విజయ





# వానరసహాయం

ఒక పట్టణంలో ఒక పేదరాలుండేది. ఆమె భర్త చాలా మంచి పేరు తెచ్చుకున్నాడుగాని దమ్మిడీ కూడా వెనక వెయ్యకుండా, తన భార్యనూ, కుమారుణ్ణీ కడు బీదస్థితిలో ఉంచి చనిపోయాడు. అతని కొడుకు పేరు ''నిద్ర మొహం'' రంగడు.

తండ్రి పోయేసరికి రంగడికి పదిహేనేళ్ళు. కాని వాడికి కూచున్న చోటినుంచి కదిలే ఓపిక ఉండేదికాదు. పట్టి మన్ను తిన్న పాము. వాడు ఎప్పుడు చూసినా పడుకుని నిద్రపోతూ వుండేవాడు. లేచి తిరుగుతూ వుండగా, ఏదైనా పని చేస్తూండగా వాణ్ణి చూసినవారెవరూ లేరు.

''వాణ్ణి దేవుడు అట్లా సృష్టించాడు. ఏం చేస్తాం?'' అనుకుని రంగడి తల్లి, వాణ్ణి రొష్టు పెట్టకుండా, తానే నాలుగిళ్ళూ తిరిగి, దొరికిన కూలీ చేసుకుని, ఆ డబ్బులతో తన పొట్టా తన కొడుకు పొట్టా నింపుతూండేది. రంగడు తల్లి లేపినప్పుడు లేచి అన్నం తిని మళ్ళీ పడుకుని నిద్రపోయేవాడు.

రంగడి ఇంటి పొరుగునే ఒక వర్తకుడుండేవాడు. ఆయన పేరు వరహాలశెట్టి. ఆయన వర్తకం మీద చీనాకు పోతున్నాడని రంగడి తల్లి విన్నది. అదృష్టవశాత్తూ ఆమెకు అప్పుడే నెల జీతం ముట్టింది. అందులో అయిదు వెండికాసులు తీసి రంగడికిచ్చి ఆవిడ, ''నాయనా, వీటిని వరహాలశెట్టి కిచ్చి, తిరిగి వచ్చేటప్పుడు చీనా నుంచి ఇది పెట్టి ఏదన్నా సరుకు తెచ్చిపెట్టమను, దానితో నువు వర్తకం చేసుకుని బతుకుదువుగాని,'' అన్నది.

తల్లి పోరగా, పోరగా రంగడు ముక్కుతూ, మూలుగుతూ లేచాడు, ఆవలించాడు. తల్లి దగ్గిర అయిదు

కాసులూ తీసుకుని, నిద్రమత్తుగా నడుస్తూ వరహాలశెట్టి వద్దకు వెళ్ళి, తల్లి చెప్పిన నాలుగు ముక్కలూ చెప్పాడు.

రంగణ్ణి చూస్తే వరహాలశెట్టికి జాలి వేసింది. ఆ కొద్ది డబ్బుతో ఈ రంగడు వర్తకం చేసేదేమిటి? బాగుపడేదేమిటి? ఈ సంగతి తెలిసి కూడా, దయాగుణం గలవాడు కావటంచేత వరహాలశెట్టి, "అలాగే నాయనా!" అంటూ అయిదు వెండి కాసులూ తీసుకున్నాడు. రంగడు మళ్లీ ఇంటికి తిరిగి పోయి హాయిగా పడుకుని నిద్రపోయాడు.

వరహాలశెట్టి తోటి వర్తకులందరినీ కలుపుకుని, ఓడ మాట్లాడుకుని, మంచి ముహూర్తం నిర్ణయించి లంగరు ఎత్తించాడు. అదృష్టవశాత్తూ దారి పొడుగునా గాలి అనుకూలించింది. ఓడ రేవుపట్టిన చోటనల్లా వర్తకులకు క్రయ విక్రయాలు బాగా సాగాయి. చివరకు ఓడ చీనాదేశం చేరింది. అక్కడ వర్తకులందరూ తాము తెచ్చిన సరుకులు పూర్తిగా అమ్మేసి మారు బేరానికి చీనాంబరాలూ, దంతపు సామానులూ, రత్నాలూ మొదలైనవి ఎవరి శక్తి కొద్దీ వారు కొనుక్కున్నారు. మళ్ళీ ఓడ తిరుగు ప్రయాణమయింది.

పది రోజులు గడిచాక వరహాలశెట్టికి అకస్మాత్తుగా రంగడిచ్చిన అయిదు వెండి కాసుల మాటా జ్ఞాపకం వచ్చింది. అది పెట్టి ఏదైనా సరుకు కొని తెచ్చిపెట్టమన్నాడు రంగడు. వర్తకం అడావుడిలో





ఒకడి వెంట మూడు కోతులున్నాయి. అందులో రెండు చలాకీ అయినవి, యజమాని ఏ ఆట ఆడమంటే ఆ ఆట ఆడగలవి. మూడో కోతి ముసలిది. దానికి ఒక్క ఆటా వచ్చినట్టు కనబడలేదు. మిగిలిన రెండూ ఆడుతుంటే అది దిగులు ముఖం పెట్టి సముద్రం మీదికి చూస్తూ కూచుంది.

ఆ కోతులను చూస్తూంటే వరహాల శెట్టి కొక ఆలోచన వచ్చింది. రంగడిచ్చిన అయిదు వెండి కాసులతో ఒక కోతిని కొనుక్కుపోయి ఇస్తే, తన బాధ్యత తీరి పోతుందనుకున్నాడు శెట్టి.

శెట్టి ఆ విషయమే మరిచాడు, పోనీ తాను కొన్నవాటిలో ఏదైనా రంగడికిద్దామా అంటే అంత చవక వస్తువు ఏదీ లేదు.

వరహాలశెట్టి మిగిలిన వర్తకులతో, ''ఓడను మళ్లా చీనాకు తీసుకుపోదాం. ఇలా నా వల్ల పొరపాటు జరిగిపోయింది," అన్నాడు. వారెవ్వరూ అందుకు ఒప్పుకోక, ''కావలిస్తే మేమంతా తలా ఒక అయిదు మొహరీలూ చందా వేసుకుని ఆ కుర్రవాడికి ఇచ్చుకుంటాం. ఓడ మాత్రం వెనక్కు తిప్పవద్దు!'' అన్నారు.

కొన్నాళ్లు గడిచాక ఓడ తూర్పుదీవుల్లో ఒక రేవు చేరుకున్నది. ఓడ దగ్గిరికి బిచ్చగాళ్లు చాలామంది వచ్చారు. వారిలో

''అబ్బీ, ఆ కోతుల్లో ఒకటి అమ్ముతావా? అయిదు కాసులిస్తాను!'' అన్నాడు శెట్టి కోతులాడించే వాడితో.

''ఈ ముసలికోతిని తీసుకోండి బాబూ!" అన్నాడు వాడు.

''పడుచుకోతి నివ్వరాదురా?'' అన్నాడు శెట్టి.

''వాటిని నూరు కాసులకూ్కడా ఇవ్వను బాబూ. అవే నా బతుకుతెరువు. ఈ ముసలి మొద్దును అయిదు కాసులకు కొన్నాను. తిండి దండగే తప్ప ఒక్క ఆటా రాదు. నేర్పినా నేర్చుకోదు. దాన్ని తీసుకోండి, బాబూ!'' అన్నాడు కోతుల నాడించేవాడు బతిమాలుతూ.

చేసేదిలేక వరహాలశెట్టి ముసలికోతిని కొని ఓడ ఎక్కాడు. అది కూడా రంగడి లాటిదిగానే కనబడింది. తిండి తినే టప్పుడు తప్ప మిగిలిన అన్నివేళలా కునికిపాట్లు పడుతూవుండేది.

మరికొంత కాలానికి ఓడ ముత్యాల దీవి చేరింది. ఈ దీవి చుట్టూ సముద్రంలో ముత్యపు చిప్పలు దొరుకుతాయి. ఈ దీవిలో ఉండే పల్లెవాళ్ళు, వర్తకులు వచ్చినప్పుడు నీటిలో ఈది ముత్యపు చిప్పలు పట్టుకువచ్చి చౌకగా అమ్ముతూంటారు. వర్తకుల అదృష్టాన్నిబట్టి ఒక్కొక్కసారి ఒక్కొక్క వర్తకుడికి ముత్యపు చిప్పల్లో పెద్ద పెద్ద ముత్యాలు దొరుకుతాయి.

ఈ ఓడ ఈ దీవికి వచ్చింది ముత్యపు చిప్పల కోసమే. ఓడ రేవు చేరగానే పల్లె కుర్రవాళ్లు కేకలు వేసుకుంటూ పరిగెత్తుకుంటూ వచ్చి నీటిలోకి దూకారు. అంతదాకా మన్నుతిన్న పాములాగా కూర్చుని ఉండిన కోతి ఈ కుర్రాళ్ళ కేకలు విని లేచి ఒక్క దూకున ఓడలో నుంచి సముద్రంలోకి దూకింది.

పాపం, రంగడికి కోతికూడా దక్కదు కాబోలునని వరహాలశెట్టి భయపడ్డాడు. కాని కొద్దిసేపట్లో ఆ కోతి రెండు చేతులా ముత్యపు చిప్పలు రొమ్ముకు అదిమి పట్టుకుని ఈదుతూ వచ్చింది. ఓడలోకి ఎక్కి వాటిని ఒక చోట పెట్టి మళ్ళా సముద్రంలోకి దూకింది. చూస్తుండగానే



అది దాదాపు ఒక వంద ముత్యపు చిప్పలు తెచ్చి పోగుపెట్టింది.

మిగిలిన వర్తకులు ఎవరికి తోచినన్ని ముత్యపు చిప్పలు వారు కొనుక్కున్నారు. ఏ ఒకరికీ రెండు మూడు ముత్యాలు మించి దొరకలేదు. అవయినా చాలా చిన్నవి. కొందరు అదృష్టహీనులకు ఒక ముత్యమూ దొరకలేదు. కాని కోతి తెచ్చిన ముత్యపు చిప్పలలో అనేక పెద్ద ముత్యాలూ, చిన్న ముత్యాలూ దొరికాయి.

దీనికి కారణం ఉన్నది. ఈ ముసలి కోతి ఒకప్పుడు ఈ ముత్యాలదీవి మీదనే వుండేది. దీని యజమాని ఒక పల్లెవాడు. వాడు దీనికి ముత్యపుచిప్పలు పట్టుకు రావటం నేర్పాడు. కొంత కాలానికి వాడు చనిపోయాడు. తరవాత దాన్ని ఏ పడవ కళాసులో పట్టుకుని కొంతకాలం పెంచారు. అది అస్తమానం నిద్రమత్తుగా ఉండటం చూసి, దాన్ని మరొక దీవిలో కోతులాడించుకునేవాడికి చౌకగా అమ్మారు. అదే ఇప్పుడు రంగడి సొత్తయి, అప్పుడే వాడికొక నిధి పోగుచేసి పెట్టింది. కోతుల నాడించేవాడు ఈ కోతిని తన వద్ద అంతకాలం ఉంచుకుని కూడా దాని విలువ తెలుసుకోలేకపోయాడు.

వరహాలశెట్టి రంగడి ముత్యాలన్నీ భద్రంగా దాచి తన పట్టణం చేరగానే వాటిని రంగడికి వప్పజెప్పాడు. అన్న ప్రకారం వర్తకులంతా రంగడికి తలా ఐదు బంగారు మొహర్లూ ఇచ్చుకున్నారు.

ఆ సొమ్ముతో రంగడు చక్కని మేడ కట్టించుకుని ముత్యాల అమ్మకంతో చాలా ధనవంతుడైనాడు. ముత్యాలదీవిని చూడగానే కోతికి మత్తు వదలినట్టే, చేసేటందుకు పని కనబడగానే రంగడి మత్తు కూడా వదిలింది. అతను ఏడాదికొకసారి తన కోతిని తీసుకుని ఓడ మీద ముత్యాల దీవికి వెళ్ళేవాడు, ముత్యపు చిప్పలు దొరికినన్ని తీసుకుని తిరిగి వచ్చేవాడు. బోలెడన్ని ముత్యాలు దొరికేవి. ఈ విధంగా రంగడు గొప్ప ధనికుడై, పెళ్ళి చేసుకుని చాలాకాలం సుఖంగా బతికాడు.





# శాస్త్రి

పరంధామయ్య పెద్ద వడ్డీవ్యాపారి. తన దగ్గిరికి అప్పుకోసం వచ్చిన వాడి అవసరాన్నిబట్టి వడ్డీ నిర్ణయించే వాడు. ఒకసారి జయరామయ్య అనే రైతు వచ్చి, "అయ్యా, నేను నా కూతురి పెళ్ళి ప్రయత్నంలో ఉన్నాను. సంబంధం కుదరగానే పెళ్ళి ఖర్చుకు పదివేలు కావాలి. ముందుగానే మీకు చెప్పుదామని వచ్చాను. వాయిదాల మీద తీర్చగలను,'' అన్నాడు.

అంత పెద్ద మొత్తం జయరామయ్యకు ఇచ్చేవాడు మరొకరు ఊళ్ళోలేడు. అంతేగాక అతనికి ఇది తప్పే ఖర్చుకాదు. అందుచేత పరంధామయ్య పదివేలు సర్దటానికి సమ్మతించుతూనే, వడ్డీ మాత్రం చాలా హెచ్చుగా ఇయ్యాలని జయరామయ్యతో అన్నాడు.

''అయ్యా, నేను అంత వడ్డీ ఇచ్చుకోలేను. అంతగా అయితే, ఖాళీగా ఉన్న మా తాతలనాటి భవనం తెగనమ్మి, పిల్ల పెళ్ళి చేసుకుంటాను,'' అంటూ జయరామయ్య వెళ్ళిపోయాడు.

చేతికి చిక్కిన చేప జారిపోయినట్టయింది పరంధామయ్యకు. జయరామయ్య తాతల కొంప దయ్యాలకొంప అని గట్టి పుకారు లేవదీసి, దాన్ని ఎవరూ కొనకుండా చేస్తే, అతను దేవుడా అంటూ తన వద్దకే డబ్బుకోసం వస్తాడనుకుని, అలాగే పుకారు లేవదీశాడు.

జయరామయ్య మరి కొన్ని చోట్ల అప్పు పుట్టించే ప్రయత్నం చేసి, ఆ ప్రయత్నాలు ఫలించక, ఇల్లు అమ్మకానికి పెట్టేసరికి, అది దయ్యాలకొంప అని విని ఎవరూ కొనటానికి రాలేదు.

ఈ సమయంలోనే పరంధామయ్యకు చిరకాల మిత్రుడైన ఒక జమీందారు అతిథిగా వచ్చి, నాలుగు రోజులున్నాడు.

శరత్

అతను జయరామయ్య పూర్వీకుల లోగిలి చూసి ముచ్చటపడి, "ఇటువంటి ఇళ్ళు ఇప్పుడు కట్టేవాళ్లు లేరు. అమ్మకానికి ఉంటే లక్ష రూపాయలు పోసి కొన గలను." అని పరంధామయ్యతో అన్నాడు.

ఆ ఇల్లు అమ్మకానికి ఉన్న సంగతి అతను తన మిత్రుడికి చెప్పక, ఆయన వెళ్ళిపోగానే జయరామయ్య వద్దకు వచ్చి, "నీ కుమార్తె పెళ్ళి ఖర్చు నిమిత్తం మీ పాత ఇల్లు అమ్ముతానన్నావు కదా? ఆ పదివేలూ నేనే ఇస్తాను. నాకు ఇల్లురాసి ఇయ్యి." అన్నాడు.

జయరామయ్య మందమతి కాదు. పరంధామయ్య ఇల్లు కొంటాననటంలో ఏదో ఎత్తు ఉంటుందని ఊహించి, అతను, "నాకు అప్పుగా కావలసినది పదివేలు గాని, ఇంటి ఖరీదు పదివేలని ఎవరు చెప్పారండీ? కనీసం యాభైవేలయినా చేస్తుందా ఇల్లు. ధర ఇచ్చుకోగల వాళ్లకే దాన్ని అమ్ముతాను. మీరు హైరాన పడ కండి." అన్నాడు.

యాభైవేలకు ఇల్లు కొన్నా, దాన్ని లక్ష రూపాయలకు జమీందారుకు అమ్మి యాభైవేలు లాభం చేసుకోవచ్చు! అందు కని పరంధామయ్య సంకోచించ కుండా జయరామయ్యకు యాభై వేలూ ఇచ్చి ఆ పాతకాలపు ఇల్లు కొనుక్కున్నాడు.

ఏదో అనేశాడే గాని, తన పాత ఇల్లు ఇరవైవేలకైనా అమ్ముడవుతుందని జయ రామయ్య కలలో కూడా అనుకోలేదు. అతను తన కూతురికి వైభవంగా పెళ్లి చేసి, కొంత పొలం కూడా కొనుక్కున్నాడు.

కొద్ది రోజులు గడవనిచ్చి, పరం ధామయ్య తన మిత్రుడైన జమీందారుకు కబురు చేస్తూ, లక్ష రూపాయలకు ఇల్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నట్టు తెలిపాడు.

"ఆ ఇల్లు కొనే ఆలోచన మాను కున్నాను. అది దయ్యాల కొంప అని అందరూ అంటున్నారు," అని జమీం దారు పరంధామయ్యకు జవాబుపంపాడు. పరంధామయ్య తాను తీసుకున్న గోతిలో తానే పడ్డాడు.






ఒకసారి నారదుడు సంచారం చేస్తూ, వ్యాసుడి ఆశ్రమానికి వచ్చాడు. వ్యాసుడు అతనికి భక్తిగా అర్ఘ్యపాద్యాలిచ్చి కూర్చోబెట్టి, ''మహాత్మా, సంసారంలో సుఖమనేది కొంచెం కూడా లేదా?'' అంటూ తన అనుభవాలన్నీ చెప్పాడు. వ్యాసుడు పుట్టినప్పుడే అతన్ని తల్లి వదిలేసింది. అతను తపస్సు చేసుకుంటూ కొడుకును సంపాదించుకున్నాడు. శివుడి దయవల్ల కలిగిన ఆ కొడుకు తండ్రిని వదిలేసి, దుఃఖంలో ముంచి వెళ్ళిపోయాడు. ఈ విధంగా ముందు తరంచేతా, వెనుక తరంచేతా విసర్జించబడిన వ్యాసుడికి మళ్ళీ సంసార బంధంలో చిక్కుకునే అగత్యం ఏర్పడింది. అతని తల్లి అయిన సత్యవతి శంతనుణ్ణి పెళ్ళాడి కొడుకులను కని, ముందు భర్తనూ, తరవాత కొడుకులనూ పోగొట్టుకున్నది. ఆమె అజ్ఞవల్ల వ్యాసుడు ఆమె కోడళ్లకు గుడ్డివాడైన ధృతరాష్ట్రుణ్ణీ, పాలిపోయిన పాండుణ్ణీ, దాసీ పుత్రుడైన విదురుణ్ణీ కనవలసి వచ్చింది. ఇలా ముగ్గురిని కన్నాడే గాని, వారిలో ఒక్కడూ వ్యాసుడికి పిండాలు పెట్టటానికి పనికి రాడు!

ఆ తరవాత వ్యాసుడి సంతతి వాళ్ళయిన ధృతరాష్ట్రుడూ, పాండుడూ ఇంకో తరాన్ని కన్నారు. వాళ్ళ తగాదాలలో వ్యాసుడు తల దూర్చవలసి వచ్చింది. పాండుడి కొడుకులు అడవులకు పోయి అష్టకష్టాలూ పడ్డారు. ఈ విధంగా

**22. నారద సంసారం**



వ్యాసుడు సుఖదుఃఖాల మధ్య తాను ఎలా నలిగినదీ చెప్పి, ''మహాత్మా, కొడుకులూ, తండ్రులూ, మనమలూ అనే ఈ భ్రాంతి నుంచి విముక్తి ఎలా కలుగుతుంది? సంసారంలో చిక్కిన వాడి మనస్సుకు సుఖం ఎలా లభిస్తుంది? దయచేసి చెప్పు,'' అని అడిగాడు.

దానికి నారదుడు, ''నాయనా, సంసారంలోపడి మోహం చెందని ప్రాణి ఎక్కడైనా ఉంటాడా? హరిహర బ్రహ్మదులు సైతం మోహంలో పడి, నేను గొప్పజ్ఞానినని నన్ను మెచ్చుకుంటారు. కాని అది నిజం కాదు. ఒకప్పుడు నేను మోహంలో పడి, భార్యకోసం ఎటువంటి పాట్లు పడ్డానో చెబుతాను విను.'' అంటూ తన కథ వ్యాసుడికి ఇలా చెప్పసాగాడు:

ఒకనాడు నారదుడూ, పర్వతుడూ భూలోక సంచారం చేస్తూ, పుణ్యక్షేత్రాలూ, ఋష్యాశ్రమాలూ చూస్తూ, తమలో తాము ఒక నియమం చేసుకున్నారు. అదేమిటంటే, ఒకరి ఆలోచనలు ఇంకొకరి దగ్గిర దాచకుండా చెప్పెయ్యాలి.

వారు అలా సంచారం చేస్తూండగా ఎండాకాలం అంతమై, చాతుర్మాస్యం (వానాకాలం) వచ్చింది. చాతుర్మాస్యం జరపటానికి ఏదో ఒక చోట ఉండిపోవాలి. వారికి సంజయుడు అనే రాజు ఉండే నగరు అందుకు దొరికింది. వారు రాజుగారి ఇంటనే బస ఏర్పాటు చేసుకున్నారు. వానలు కురిసే ఆ నాలుగు మాసాలూ సంచారానికి పనికిరావు. రాజుగారి ఇంట వాళ్ళు సుఖంగా ఉంటూ వచ్చారు. రాజు కూతురు మదయంతి స్వయంగా వాళ్లకు పరిచర్యలు చేయసాగింది. వాళ్ళు స్నానం చెయ్యటానికీ, భోజనాలకూ, పడుకోవటానికీ ఆమె చక్కని ఏర్పాట్లు ఎంతో శ్రద్ధగా, ఇద్దరి మధ్యా పక్షపాతం ఏ మాత్రమూ లేకుండా చేస్తూ వచ్చింది. వాళ్ళకు వేదాధ్యయనంతోనూ, గాన వినోదాలతోనూ కాలం మహాసుఖంగా గడవసాగింది.

క్రమంగా మదయంతికి నారదుడి మీద మోహం పుట్టుకు వచ్చింది. అతని వీణా వాదనమూ, సామగానమూ ఆమె మనసును అమితంగా ఆకర్షించాయి. ప్రేమ పూర్వకంగా ఆమెచేసే పనులు నారదుణ్ణి బలంగా ఆకర్షించాయి. ఆమె సహజంగా, ఇద్దరికీ సౌకర్యాలు అమర్చటంలో, నారదుడి పట్ల పక్షపాతం చూపసాగింది. స్నానం చేసేటప్పుడు నారదుడికి వేడి నీళ్ళూ, పర్వతుడికి చన్నీళ్ళూ ఏర్పాటయేవి; భోజనం దగ్గిర నారదుడికి పెరుగు వడ్డన అయితే, పర్వతుడికి మజ్జిగ మాత్రమే లభించేది. పక్కలు కూడా ఇద్దరికీ ఒక విధంగా అమరేవి కావు. ఆమె నారదుడికేసి చూసే చూపులు గురించి చెప్పనే అక్కర్లేదు.

వారిద్దరికీ రాజకుమార్తె మదయంతి పరిచర్యలు చెయ్యటంలో ఈ తేడా కొట్ట వచ్చినట్టు కనపడేసరికి, పర్వతుడు నారదుడితో ఏకాంతంగా, "రాజు కూతురు వాలకమూ, ప్రవర్తనా చూస్తే నిన్ను వరించినట్టుగా కనపడుతుందే! నీకు కూడా ఆమె మీద మోహం వున్నట్టే ఉన్నది. మరి మనం ఒకరి దగ్గిర ఒకరం రహస్యాలుంచుకోరాదన్న నియమం మరిచావా? చాటుమాటెందుకూ? నిజం చెప్పు!" అన్నాడు.



నారదుడు కొంచెం సిగ్గుపడుతూ, "మునీంద్రా, ఇందులో దాచేటందుకు ఏమున్నదీ? రాజకుమార్తె నన్ను వలచింది, నేనూ ఆమెను ప్రేమిస్తున్నాను," అన్నాడు.

ఆ మాట వింటూనే పర్వతుడికి కోపం వచ్చి, "నియమం తప్పి నన్ను మోసగించావు గనక, నీది కోతిముఖం అయిపోవుగాక!" అని శపించాడు.

నారదుడు కూడా కోపోద్రేకం కలిగి, "ఈ కాస్త తప్పుకు నన్ను శపించిన నీకు స్వర్గప్రాప్తి లేకపోవుగాక! ఇక నువు భూలోకంలోనే ఉండిపో!" అని ఎదురు శాపం యిచ్చాడు.



ఇలా శాపం పొంది పర్వతుడు వెళ్ళిపోయాడు. నారదుడికి కోతిముఖం వచ్చేసింది. అయినా, నారదుడి వీణా గానం విని ఆనందిస్తూ రాజకుమార్తె అతనికి ఆదరంతో శుశ్రూషలు చేస్తూ వచ్చింది. తన మేనల్లుడైన పర్వతుడు వెళ్ళిపోయినందుకు నారదుడు మాత్రం బాధపడ్డాడు.

ఇంతలో సంజయరాజు తన కుమార్తెకు స్వయంవరం నిశ్చయించి, తన మంత్రితో, "అమ్మాయికి పెళ్ళి చేస్తాను. దాని అందానికి తగిన అందమూ, గుణమూ, కులమూగల వరుణ్ణి చూడు," అన్నాడు.

"మహారాజా, మీరు కోరినలాటి వరులు ఎందరో వున్నారు. వారిలో మీకు నచ్చిన వాణ్ణి మీరు నిర్ణయించండి," అన్నాడు మంత్రి.

తన పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నట్టు తెలిసి, మదయంతి తన దాది ద్వారా తండ్రికి కబురు పంపుతూ, తాను నారదుణ్ణి వరించాననీ, మరొకరిని పెళ్లాడలేననీ తెలియజేసింది.

దాది వచ్చి సంజయరాజుకు ఈ మాట చెప్పినప్పుడు అతని భార్య కైకేయి అక్కడే ఉన్నది. రాజు ఆమెకేసి చూసి, "అమ్మాయి ఆ కోతిముఖాన్ని ఎలా వరించింది? అతను మన పిల్లకు ఎలా తగి ఉంటాడు? అతనికి పిల్లను యెలా ఇయ్యటం? బుద్ధిలేక మనపిల్ల తప్పుడు నిర్ణయాలు చేస్తే, దాన్ని సరిదిద్దటం మన కర్తవ్యం. అతగాడు బిచ్చగాడని నువు అమ్మాయికి తెలియజెయ్యి," అన్నాడు.

కైకేయి తన కూతురితో ఏకాంతంగా, "అమ్మా, నువు నవనవలాడే శరీరంగల దానివి; ఆ నారదుడు బూడిద పట్టించడం చేత మొరటుదేలిన శరీరం గలవాడు! నీ ముఖం ఎంత అందమైనది! అతనిది కోతి ముఖం! అతన్ని ఎలా వరించావు? అది అలా వుండగా, అతను అస్తమానమూ తిరుగుతూ బిచ్చమెత్తుకునేవాడు! ఇతన్నా నువు వరించేది? నీ మతిమాలినతనం చూసి మీ నాన్నగారు చాలా బాధపడు



తున్నారు. ఎవరైనా లేత తమలపాకులను తీసుకుపోయి ఒంటెకు మేపుతారా? నిన్ను ఆ నారదుడికిచ్చి పెళ్ళి చేస్తే, మమ్మల్ని చూసి అందరూ నవ్వరూ?'' అంటూ రకరకాలుగా బోధించింది.

కాని సంగీత వ్యామోహంగల మదయంతి తన మనసు మార్చుకోక, "అమ్మా, మనిషి ఎంత అయితే మొహమూ, మఃక్షూ బాగుండి, రాజ్యమూ, ధనమూ వుండి ఏం లాభం? ఈ నారదుడి వంటి సంగీతప్రవీణుడికి మొహమూ, రాజ్యమూ, ధనమూ, అందమూ ఎందుకు? ఇతని గానానికి రాళ్లు పరవశం చెందుతాయి. ఇతనిలాటి గాయకుడు మూడు లోకాలలోనూ మరొకడు లేడు. రసజ్ఞతలేని వాణ్ణి కట్టుకున్న దానికి ప్రతిక్షణమూ చావే! రసజ్ఞుడికి భార్య అయితే జీవితమంతా అనందమే! స్వరజ్ఞానం గలవాడు మామూలు మనిషి అయినా దేవతలతో సమానుడే! పశువులను కూడా అనందంలో ఓలలాడించే సంగీతం వినటం విషయంలో పెద్దలు అనాదరణ చూపితే, వారి జన్మ ఏంజన్మ? నారదుడి శక్తి నాన్నకు తెలియదు. శాపం తగిలి అతనికి వానరముఖం రాకమునుపు నుంచీ నేనతన్ని ప్రేమించాను. కోతి ముఖం వచ్చినా అతను నా ప్రియుడే! కిన్నరుల ముఖాలు గుర్రం ముఖాలు. అందుచేత వారిగానాన్ని ఆదరించని వాళ్లు ఎవరైనా ఉంటారా? విద్య లేకపోయాక ముఖం దేనికి? అతన్ని తప్ప, నవ మన్మధుడు వచ్చినా, నేను పెళ్ళాడను. నన్ను అతని కిచ్చి పెళ్ళి చేయించు. అందుకు నాన్నను ఒప్పించు.'' అన్నది.

కైకేయి తన భర్త వద్దకు వెళ్లి, తన కూతురు నిశ్చయాన్ని తెలిపింది. రాజు మరే అభ్యంతరమూ చెప్పకుండా, పెళ్లి ప్రయత్నాలు చేసి, నారదుడికి మదయంతి నిచ్చి పెళ్ళి చేసేశాడు.

నారదుడు మామగారి ఇంటనే ఉండి పోయాడు. భార్య తన వద్దకు వచ్చినప్పుడల్లా అతను తన కోతిముఖం తలచు



కుని అమితంగా బాధపడేవాడు. కాని మదయంతి ఆ విషయం ఏ మాత్రమూ బాధపడేది కాదు.

కొంతకాలం గడిచింది. ఈ లోపల పర్వతుడు ఎన్నోచోట్లు తిరిగి, నారదుణ్ణి చూడటానికి వచ్చి, తన మేనమామ ముఖం చూసి జాలిపడి, "రాజకుమార్తె కోసం నా శాపాన్ని ఉపసంహరించుకుంటున్నాను. నీ ముఖం యథాపూర్వం ఉండుగాక," అన్నాడు.

"నేను కూడా నిన్ను దుర్బుద్ధితో శపించాను. నువు మామూలు ప్రకారం స్వర్గానికి వెళ్ళు," అన్నాడు నారదుడు పర్వతుడితో.

పర్వతుడు సంతోషించి వెళ్లిపోయాడు. నారదుడిలో మార్పుకు ఎంతో ఆనందం పొందిన రాజకుమార్తె తన తల్లి దగ్గిరికి వెళ్ళి, తన భర్త ముఖం మళ్ళీ అందంగా మారినట్టు చెప్పింది. ఆమె ఈ మాటను రాజుతో చెప్పింది. రాజు కూడా సంతోషించాడు.

ఈ విధంగా నారదుడికి సంసారంలో మాయవల్ల కష్టాలు ఎలా సంభవించేదీ అనుభవంలోకి వచ్చింది. అతను వ్యాసుడికి తన అనుభవం మరొకటి కూడా చెప్పాడు.

ఒకసారి నారదుడు శ్వేతద్వీపంలో విష్ణువును చూడబోయాడు. లక్ష్మీదేవి నారదుణ్ణి చూడగానే చప్పున లోపలికి వెళ్లిపోయింది. ఇందుకు నారదుడు కొంచెం నొచ్చుకుని, విష్ణువుతో, "నేనేమైనా విటగాడినా, దుర్మార్గుడినా? తపస్వినీ, ఇంద్రియాలను జయించిన వాడినీనూ! అలాటప్పుడు నీ భార్య నన్ను చూడగానే చప్పున లోపలికి వెళ్ళిపోయింది గదా? ఇదేమన్నా మర్యాదగా ఉన్నదా?" అన్నాడు.

అతిశయ పూర్వకంగా నారదుడు ఇలా మాట్లాడినందుకు విష్ణువు కోపగించుకోక, "భర్తకాక ఏ ఇతర పురుషుడి సాన్నిధ్యంలోనూ ఉండకపోవటం స్త్రీ ధర్మం.

ఎంతటి వాళ్లయినా ఇంద్రియాలకు అధీనులు కాకుండా ఉండలేరు గదా! ఎంతటి మహా మహులకూ అది సాధ్యంకాదు. మా త్రిమూర్తులం కూడా మాయకు లోబడిన వాళ్ళమే.'' అన్నాడు.

నారదుడు ఆశ్చర్యపోయి, ''మాయ ఎలాటిది ? దాని బలం ఎటువంటిది ? '' అని అడిగాడు.

''నా వెంట వచ్చావంటే నీకు మాయ కనపడేలాగా చేస్తాను, దాన్ని చూసి దుఃఖ పడవద్దు,'' అని విష్ణువు గరుత్మంతుణ్ణి పిలిచాడు.

నారదుడూ, విష్ణువూ గరుత్మంతుడి మీది ఎక్కి, ఎక్కడికో వెళ్ళారు.

కాన్యకుబ్జ మనే ఊరికి సమీపంగా చక్కని చెరువు ఉన్నది. అందులో అందమైన కలవలూ, తామరలూ ఉన్నాయి. అందులోని నీరు ఎంతో నిర్మలంగా ఉన్నది.

విష్ణువు నారదుడి చిటికెన వేలు పట్టుకుని చెరువు వద్దకు తెచ్చి, ''ఇందులో స్నానం చేసి, కాన్యకుబ్జనగరానికిపోదాం,'' అన్నాడు.

నారదుడు వీణా, జింకతోలూ ఒకచోట పెట్టి, చెరువులోకి దిగే సరికి, అతని పురుషరూపంపోయి, స్త్రీరూపం వచ్చింది. ఆ సంగతి నారదుడు ఎరగడు. కాని



విష్ణువు నారదుడి వీణా, జింకచర్మమూ తీసుకుని, గరుత్మంతుడి మీద ఎక్కి వెళ్ళిపోయాడు.

నారదుడు స్త్రీ రూపంతో నీటి నుంచి బయటికి వచ్చేసరికి, అతనికి తన వీణ గాని, విష్ణువుగాని జ్ఞాపకం రాలేదు. ఇంతలో రథం మీద తాలధ్వజు డనే రాజు ఏనుగులనూ, గుర్రాలనూ, భటులనూ వెంట బెట్టుకుని వచ్చి, నారదుడి కేసి ఆసక్తితో చూసి, ''నువు నదీసుందరివా? దేవసుందరివా ? నాగసుందరివా? ఇక్కడ ఒంటరిగా ఎందుకున్నావు?'' అని అడిగాడు. అతను ఆ స్త్రీని ప్రేమించి, పెళ్లాడతానన్నాడు. స్త్రీగా ఉన్న నారదుడు

అందుకు సమ్మతించాడు. ఇద్దరూ నగరానికి వెళ్ళి, అక్కడ పెళ్ళి చేసుకున్నారు.

నారదుడిలో పురుషభావంగాని, బ్రహ్మజ్ఞానంగాని కొంచెం కూడా మిగలలేదు. తనకు సాటిరాగల స్త్రీలే లేరన్న గర్వం కూడా వచ్చింది. నారదుడు పన్నెండేళ్ళు కాపరం చేసినాక గర్భం కలిగింది. తరవాత కొడుకు పుట్టాడు. వాడికి వీరవర్మ అని పేరు పెట్టారు. తరవాత వరసగా కొడుకులు పుట్టుకురాసాగారు. నారదుడు ఆ స్త్రీరూపంలో పన్నెండుమంది కొడుకులను కన్నాడు. కొడుకులు పెద్దవారై, పెళ్ళిళ్ళు చేసుకుని, తాము కూడా పిల్లల్ని కన్నారు. వంశం విస్తరించింది.

కొంత కాలానికి కాన్యకుబ్జనగరం మీదికి శత్రువులు యుద్ధానికి వచ్చారు. ఆ యుద్ధంలో నారదుడు కన్న కొడుకులూ, వాళ్ళ కొడుకులూ చచ్చారు. నారదుడికి తీరని గర్భశోకం సంప్రాప్తమయింది.

ఆ సమయంలో విష్ణువు ముసలి బ్రాహ్మణుడి రూపంలో వచ్చి, "ఎవరు కొడుకులు? ఎవరు నువు? కాలవశాన అన్నీ అవుతాయి. ముందు స్నానం చేసి, తర్పణాలు విడు," అని చెప్పాడు.

అతను నారదుణ్ణి తన వెంట పురుషతీర్థం అనే సరస్సుకు తీసుకుపోయి, అందులో స్నానం చెయ్యమన్నాడు. అందులో మునగగానే నారదుడి స్త్రీరూపం పోయి పురుషరూపం వచ్చింది. ఒడ్డున తన వీణనూ, జింక చర్మాన్నీ పట్టుకుని విష్ణువు కనిపించి, "ఎంతసేపు, నారదా? వచ్చెయ్యి!" అన్నాడు.

నారదుడు బయటికి వచ్చి, స్త్రీగా తన జీవితాన్ని మరిచిపోయాడు. కాని తాలధ్వజుడు మాత్రం తన భార్య మగవాడై పోయినందుకు ఎంతో దుఃఖించాడు. విష్ణువు ఆ రాజుకు వేదాంతం బోధించి పంపేశాడు. మాయచేతిలో మనిషి ఎలాటి కీలుబొమ్మ అయినదీ నారదుడికి తెలిసి వచ్చింది.



# సవతుల పోరు

ముత్యాలు అనే వ్యాపారికి ఇద్దరు భార్యలు. ఇద్దరూ అస్తమానమూ పోట్లాడుకునేవారు. అది భరించలేక ముత్యాలు, ఒక స్నేహితుడి సలహా మీద, ఒక ఎత్తు వేశాడు.

ఒకనాటి సాయంకాలం అతను తన భార్యలతో ఊరికి వెళుతున్నానని చెప్పి, సత్రానికి వెళ్ళి, ఆ రాత్రి భయంకరమైన వేషం వేసుకుని, దొంగ లాగా వచ్చి తలుపు తట్టాడు. అతని భార్యలు కిటికీలో నుంచి చూసి, కెవ్వున అరిచారు.

"నాకు భయంగా ఉన్నది, అక్కా!" అంటూ చిన్నభార్య తన సవితిని వాటేసుకున్నది.

"భయం వద్దులేవే, పిచ్చిదానా!" అంటూ పెద్దది వణికిపోతూ చిన్నదాన్ని సముదాయించింది.

"తలుపులు తీస్తారా? పగలగొట్టనా?" అని ముత్యాలు కర్కశంగా అడిగాడు.

సవతులిద్దరూ కూడబలుక్కుని, చెరొక రోకలీ తీసుకుని, ధైర్యంగా తలుపు తెరిచి, "ఎవడివిరా నువ్వు?" అంటూ బయటికి వచ్చారు. ముత్యాలు పారిపోతూ, వంద రూపాయలు గల సంచీని జారవిడిచాడు. సఖ్యతగా ఉండటం లాభిస్తుందని తన భార్యలకు తెలియ గలందులకు అతను అలా చేశాడు.

కాని మర్నాడు అతను ఇంటికి తిరిగి వచ్చేసరికి అతని భార్య లిద్దరూ, "నన్ను చూసే దొంగ పారిపోయాడు! నాకే ఈ డబ్బు!" అంటూ కీచులాడుకుంటున్నారు! — వై. రాజేశ్వరి





# భయపెట్టే పిశాచాలు

ధర్మవరం ఊరికి దూరంగా ఒక పాడు బడిన ఇల్లు ఉండేది. ఆ ఇంటి ముందు పెద్ద మర్రిచెట్లు ఉండేవి. బాటసారులు పగటివేళ వాటి నీడలో విశ్రాంతి తీసుకునేవారు. కాని చీకటి పడినాక ఆ చాయలకు ఎవరూ వెళ్ళేవారుకారు. ఆ పాడు బడిన ఇంట్లో కామినీ పిశాచాలు ఉన్నట్టు చెప్పుకునేవారు. అందుకు నిదర్శనంగా చీకటిపడి ధర్మవరం చేరుకునే బాటసారులకు ఆ ఇంటి నుంచి గజ్జెల చప్పుళ్ళూ, గాజుల గలగలలూ వినిపించేవి.

ఆ కామినీ పిశాచాల సంగతి ఏమిటో తేల్చుకుందామని ధర్మవరానికి చెందిన ముగ్గురు యువకులు ఒక రాత్రి పాడు బడిన ఇంట ప్రవేశించి, చావు దెబ్బలు తిని బయట పడ్డారు.

ధర్మవరం కామినీ పిశాచాలను గురించి పట్నంలో కూడా పొక్కిపోయింది. పట్నంనుంచి పరమేశం అనే యువకుడు వచ్చి, చీకటి పడినాక ఒక మర్రిచెట్టు మీద రాత్రి అంతా గడిపి, రాత్రివేళ పాడుబడిన ఇంటినుంచి అప్పుడప్పుడూ గాజుల గలగలలూ, గజ్జెల చప్పుళ్ళూ రావటం విని, మర్నాడు ఉదయం పట్నానికి తిరిగి వెళ్ళాడు.

పదిరోజుల తరవాత ధర్మవరం గ్రామానికి ఒక తోలుబొమ్మలాటల బృందం వచ్చింది. ఆడా, మగాళ్ళు అంతా కలిసి పదిమంది ఉన్నారు. వాళ్లు ఊరి పెద్దలను కలుసుకుని, ఆ రాత్రి ఊరి బయట మర్రిచెట్ల కింద ప్రదర్శన ఇయ్యనిశ్చయించుకున్నామని తెలియజేశారు. కొందరు పెద్దలు, కామినీ పిశాచాలు ఉంటాయని, అక్కడ ఆట పెట్టవద్దన్నారు.

"మా బొమ్మలలో ఆంజనేయస్వామి ఉన్నాడు. ఆయన తెరమీద ఉన్నంత

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

సేవూ శాకినీ, ఢాకినీ గాలి దయ్యాలవల్ల గాని, భూతప్రేతగణాలవల్లగాని భయం లేదు. వాటి ఆటలు సాగవు,'' అన్నారు తోలుబొమ్మలవాళ్ళు.

అయినా కొందరు పెద్దలు గట్టిగా అభ్యంతరం చెప్పారు.

''ఎవరు వచ్చినా, రాకపోయినా మేం మాత్రం మా ఆట అక్కడ ఆడేస్తాం!'' అన్నాడు తోలుబొమ్మలాటల పెద్ద.

ఆ సాయంకాలం మర్రిచెట్లకింద తమకు కావలసిన ఏర్పాట్లన్నీ పూర్తి చేసుకుని, రాత్రి కొంత పొద్దు పోగానే ఆట ప్రారంభించారు తోలుబొమ్మలవాళ్లు.



ధైర్యం ఉన్నవాళ్ళు కొందరు వచ్చి, ఆట చూడటానికి కూర్చున్నారు.

ఆట ప్రారంభమైన కొంతసేపటికి ఎక్కడినుండో ఎముకలు వచ్చి పడ్డాయి. ప్రేక్షకులలో కొందరు భయపడి పారిపోయారు. ''అమ్మ, బాబోయ్! పిశాచాలు!'' అని వాళ్ళు పెట్టిన కేకలతో బెదిరి, మిగిలిన ప్రేక్షకులు కూడా పారిపోయారు.

ఇక, లాభంలేదనుకుని తోలుబొమ్మలవాళ్ళు తెర మీదికి ఆంజనేయుణ్ణి ఎక్కించారు. అయినా ఎముకలు పడటం ఆగలేదు. తోలుబొమ్మలవాళ్ళు పదిమందీ ఒక గుంపుగా కూడి, ''ఇవి భయపెట్టే పిశాచాలేగాని, భయపడే పిశాచాలలాగా లేవు!'' అనుకున్నారు.

ఇంతలో వాళ్ళకు పాడుబడిన ఇంటి నుంచి, గల గలా గాజుల చప్పుడూ, ఘల్లు ఘల్లున గజ్జెల చప్పుడూ వినిపించాయి. తరవాత ఆ ఇంటిలో నుంచి అయిదారుగురు దృఢకాయులు వచ్చి, వాళ్ళను చుట్టుముట్టారు.

వారిలో ఒకడు, ''మీ ఆంజనేయుడు కామినీ పిశాచాల పని పట్టుతాడా? మీపని మేం పట్టుతాం!'' అంటూ ఉండగా, తోలుబొమ్మల వాళ్లు పదిమందీ, ఆడా, మగా, అమాంతం దృఢకాయుల చేతి కర్రలను లాగేసుకుని వాళ్ళను చావగొట్ట

సాగారు. తోలుబొమ్మల వాళ్ళు అంత బలంగా ఉండటం చూసి దృఢకాయులకు మతిపోయింది. వాళ్లు కనీసం పారిపోలేకపోయారు. తోలుబొమ్మల వాళ్ళు వాళ్ళను పట్టుకుని చెట్లకు కట్టేశారు. కొందరు తమ దివిటీలు తీసుకుని పాడుబడిన ఇంట్లో ప్రవేశించారు. లోపల ఒక గదిలో గాజులకర్ర చేతులూ, రెండు గజ్జెల జతలూ కనిపించాయి.

తోలుబొమ్మల వాళ్లు చెట్లకు కట్టి ఉన్న వాళ్లను కొరడాలతో కొట్టిన మీదట వాళ్ళు అసలు సంగతి బయట పెట్టారు. గ్రామ పెద్దలైన మల్లునాయుడూ, వెంకన్న దొరా, తిమ్మన్న పంతులూ ఆ పాడుబడిన ఇంటిని అనేక అక్రమ చర్యలకు ఉపయోగిస్తూంటారు. అక్కడ అనేక కుట్రలు జరుగుతూంటాయి. తమ అధికారానికి అడ్డంగా ఉన్నవారిని శిక్షించటానికీ, దొంగ సొమ్ము చవకగా కొనటానికీ, ఇతర దుర్మార్గాలకూ పెద్దలు ఈ ఇంటిని ఉపయోగిస్తారు. తమ రహస్యం కాపాడటానికి కామినీపిశాచాల సృష్టి జరిగింది. తోలుబొమ్మల వాళ్ళకు పట్టుబడిన దృఢకాయులు ఆ పెద్దల సేవకులు. పెద్దలు వీళ్ళను జీతాలిచ్చి పెట్టుకుని, దారేపొయ్యే వాళ్ళకు గజ్జెల చప్పుళ్ళూ, గాజుల చప్పుళ్ళూ రాత్రిపూట వినిపిస్తారు.

కామినీ పిశాచాలలాగానే తోలుబొమ్మల వాళ్లు కూడా అబద్ధమే. వాళ్లు రక్షకభటులు. పరమేశం వాళ్లు పంపిన మనిషే. అతడు చెప్పిన వివరాలను బట్టి వాళ్ళు మోసం బయట పెట్టటానికి తోలుబొమ్మల నెపంతో వచ్చారు.

ఆ రాత్రే ఊరి పెద్దల ఇళ్ళ సోదా జరిగింది. వాళ్ళ వద్ద ఉండ గూడని వస్తువులు అనేకం బయటపడ్డాయి. ఆ పెద్దలనూ, వారి సేవకులనూ రక్షకభటులు పట్నానికి తీసుకుపోయారు.

ఇంతకాలమూ కామినీపిశాచాలనుకున్నది తమ గ్రామ ప్రముఖులేనని తెలిసి ధర్మవరం గ్రామస్థులు ఆశ్చర్యపోయారు.



# తెలివిగల సోదరులు

దేవగిరిలో ముగ్గురు సోదరు లుండేవాళ్ళు. వాళ్ళు ఏ పని నైనా ముగ్గురూ మూడు విధాలుగా, ఒకరు చేసినట్టు ఇంకొకరు చెయ్యకుండా, చేసేవారని విని, వారిని పరీక్షించి, ఓడించటానికి కాంచీపురరాజు వారిని తన సభలో ఫలాని రోజు, ఫలాని వేళకు, వేళ ఏ మాత్రమూ తప్పకుండా హాజరు కావలసిందని ఆజ్ఞాపించాడు. ముగ్గురూ ఒకేసారి వస్తే, అందరూ ఒక పనిని ఒకే విధంగా చేశారని రుజువు చెయ్యాలని రాజు ఉద్దేశం.

ముగ్గురూ గంట కొట్టినట్టు ఒకేక్షణంలో సభలోకి అడుగుపెట్టారు, కాని ముగ్గురూ మూడు ద్వారాలకుండా రావటం చూసి ఆశ్చర్యపోయాడు రాజు.

తరవాత రాజభటులు ముగ్గురికీ మూడు లోటాలలో పానీయం తెచ్చి ముగ్గురు సోదరులకూ ఇచ్చారు. ఒకడు వెంటనే దాన్ని తాగేశాడు. ఇంకొకడు మామూలుగా తాగాడు. మూడోవాడు కొంచెం కొంచెంగా చప్పరిస్తూ తాగాడు.

తాగిన లోటాలను ఒకడు నిలువుగానూ, ఇంకొకడు అడ్డంగానూ, మూడోవాడు బోర్లించి పెట్టారు. భటులు మరికొంత పానీయం తెచ్చారు. లోటా నిలువుగా పెట్టినవాడు పొయ్యమన్నాడు. బోర్లా పెట్టినవాడు వద్దన్నాడు. లోటా అడ్డంగా పెట్టినవాడు పోస్తే తాగుతాననీ, లేకపోతే లేదనీ అన్నాడు.

రాజు వాళ్ళ తెలివితేటలకు మెచ్చి, వాళ్ళను ఓడించటం అంత తేలిక కాదని తెలుసుకుని, వాళ్ళకు సన్మానం చేసి పంపేశాడు,

— ఎస్. అక్బర్



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Bhalchandra Kadne N. S. Olaniya

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ జూలై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కట్టుట

రెండవ ఫోటో : విప్పుట కొరకే

పంపినవారు : నందివాడ అప్పారావు, సౌపడ (ఆర్. ఎస్.) శ్రీకాకుళం జిల్లా.

బహుమతి మొత్తం రు. 25/-ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

# చందమామ కేమెల్

రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు




బహుమతులు గెలుచుకోండి
కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.
P.B. No. 9928, COLABA, Bombay-400 005.
ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ------------------------------ Age ------------

Address ------------------------------------------------

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.
ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-7-1980

**CONTEST NO.15**

# కళ్ళు మూసుకో
# ఏమికావాలో కోరుకో



మీరు పొదుపుచేసితే మీ కోర్కెలు నిజమవుతాయి. సైకిలా! బొమ్మరిల్లా! ఆటవస్తువా! ఏదయినామీ డబ్బుతో మీర్వే కొనుక్కోవచ్చును. కెనరా బ్యాంక్ **బాల క్షేమనిధి** మీ కోసమే! అందమయిన **బాల క్షేమనిధి** పెట్టె మీ పైసలు దాచుకోవడానికి బాగుంటుంది. దానికి తాళము కూడ వేసుకోవచ్చును. మీ పెట్టె నిండగానే దగ్గిరగా వున్న కెనరా బ్యాంకులో డబ్బును జమచేసి తిరిగి దానిలో కూడబెట్టవచ్చును. మీ డబ్బు పెరుగుతూ వుంటుంది. ఎందుకంటే మేముకూడ కొంత మొత్తము కలుపుతాము కనుక. త్వరలోనే ఆ మొత్తము మీరు కోరుకొనిన వస్తువు కొనుక్కోటానికి సరిపోతుంది. మీ కోర్కెలు తీరడానికి ఏలాంటి గొప్ప పద్ధతో చూశారా! పొదుపు చేయడానికి యెంతటి అద్భుతమయిన పద్ధతో చూశారా!

మీకు దగ్గిరలోనున్న కెనరా బ్యాంక్ శాఖకి వెళ్ళి వివరములను తెలుసుకోండి.

మా యితర ప్రత్యేక ప్రణాళికలు
**కామధేను, నిరంతర, విద్యానిధి.**

# బాలక్షేమ నిధి




# కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200కు పైగా శాఖలు దేశమంతటా కలవు.

maa CB 4 Tel 80

# రామ్ శ్యామ్

గురిచూసి కొట్టారు.



















